# చందమామ కేమెల్

రంగుల పోటీ

ప్రవేశ రుసుము లేదు





**బహుమతులు గెలుచుకోండి**

కేమెల్—మొదటి బహుమతి రు. 15
కేమెల్—2వ బహుమతి రు. 10
కేమెల్—3వ బహుమతి రు. 5
కేమెల్—5 కన్సొలేషన్ బహుమతులు
చందమామ—5 కన్సొలేషన్ బహుమతులు
కేమెల్—10 సర్టిఫికెట్లు

చుక్కలు పెట్టిన గీత వెంట కత్తిరించండి.

12 సంవత్సరముల లోపల వయస్సు గల్గిన విద్యార్థులు మాత్రమే పాల్గొన గలరు. పై చిత్రాన్ని ఏ కేమెల్ రంగుతోనైనా రంగు వేయండి. రంగు వేసిన ప్రవేశ పత్రాలను ఈ క్రింది అడ్రసుకు పంపండి.

P.B. No. 9928, COLABA, Bombay-400 005.

ఫలితములు తుది నిశ్చయముగాన, ఉత్తర ప్రత్యుత్తరములు అనుమతించబడవు.

Name ______________________________ Age ____________

Address __________________________________________

దయచేసి మీ పేరు, చిరునామా, ఇంగ్లీషులోనే వ్రాయండి.

VISION

**CONTEST NO.18**

బొమ్మకు పూర్తిగా రంగులు వేయాలన్నది గుర్తుంచుకోండి.

ఎంట్రీలు పంపుటకు ఆఖరు తేదీ. 31-1-1981



# చందమామ

జనవరి 1981



ఈ సంచికలో కథలు - వింతలు - విశేషాలు






విడి ప్రతి: 1-50

సంవత్సర చందా: 18-00

"న్యూట్రామూల్ మిగతావాటికన్నా
తక్కువ ఖరీదు!"




## ఇంచుమించు 3 రూపాయలు తక్కువ.

న్యూట్రామూల్, అమూల్ వారి తత్వాన్ని
సాటే ఉజ్వల [illegible] తక్కువ
ధరలో అత్యంత నాణ్యత.

మరి ప్రతి రోజూ వేలాది మంది
న్యూట్రామూల్ వైపుపే మొగ్గుతున్నారంటే
అందులో ఆశ్చర్యమేముంది గనక!




అమూల్ వారి
# న్యూట్రామూల్



మార్కెటింగ్ చేసేవారు :
గుజరాత్ కోఆపరేటివ్ మిల్క్ మార్కెటింగ్
ఫెడరేషన్ లిమిటెడ్, ఆనంద్, గుజరాత్

daCunha-GCM-31-TL

డాక్టరుగారూ! మా బొమ్మ
పాపాయికి వంట్లో
బాగాలేదు. కొంచెం చెక్ చేసి
చెప్పండి సార్.

జ్వరంలాంటిదేం కాదు.
కడుపులోనే ట్రబుల్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి. తగ్గిపోతుంది.

ఇది వర్షాకాలం
కదా డాక్టర్.
ఉడ్‌వర్డ్స్ గ్రైప్
వాటర్ ఇవ్వవచ్చా?

దానికేం? ఎండాకాలమైనా, వర్షాకాలమైనా
చలికాలమైనా, ఏ కాలమైనా సరే,
పిల్లలకు కడుపులో ఏలాంటి ట్రబుల్
వచ్చినా ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్
ఇవ్వండి.






100 ఏళ్లుగా మాతృలోకం
విశ్వసించినది

# ఉడ్‌వర్డ్స్ గ్రైప్ వాటర్

CAS OPPL 3/80 TE

# చందమామ

సంస్థాపకుడు : 'చక్రపాణి'
సంచాలకుడు : నాగిరెడ్డి

ఈ నెల బేతాళకథ [''పిడుగుపాటు''] కు ఆధారం వి. యజ్ఞరామయ్య రచన.

తల్లిదండ్రులు చేసే అతి గారాబం వల్ల, పిల్లలు ఏ విధంగా ఇంగితజ్ఞానాన్ని కూడా కోల్పోతారో, వాళ్ళను సరిదిద్దడం ఎంతటి కష్టసాధ్యమో, '' అన్నీ ఒక్కసారికే!'' అన్న కథలో మనం చూస్తాం.

## అమరవాణి

త్యాగ ఏకో గుణః శ్లాఘ్యః, కిమన్యైర్గుణరాశిభిః,
త్యాగాజ్జగతి పూజ్యంతే, పశు పాషాణ పాదపాః.

[వేరే మంచి గుణాలు ఎన్ని వున్నా, త్యాగగుణం ఒక్కటే మెచ్చదగింది. పరులకు మేలు చేయటంవల్లనే పశువులూ, ఫల వృక్షాలూ, శిలలూ కూడా ఆదరణ పాత్రమవుతున్నవి.]

సంపుటి 68 జనవరి '81 సంచిక 1

విడి ప్రతి : 1-50 : : సంవత్సర చందా : 18-00






శ్రీకంఠం మాధవరావు, నెల్లూరు

ప్ర: విశ్వాసానికీ, విజ్ఞానానికీ గల సంబంధాన్ని తెలియజేయండి. ఏయే సందర్భాలలో విశ్వాసం విజ్ఞానాన్ని అధిగమిస్తుంది ?

జ: మనిషి ఏ పనికి పూనుకున్నా అతని ప్రయత్నం వెనక ఒక విశ్వాసం ఉంటుంది. తెల్లవారి లేస్తే మనిషికి అడుగడుగునా అవసరాలే. తెల్లవారుతూనే పాలు కావాలి. కూరలు కావాలి. దుకాణంలో కిరాణా సరుకులు కావాలి. జబ్బులు చేస్తే డాక్టరు కావాలి. పిల్లలకు బడిలో చదువు సరిగా లభించాలి. పాలలో నీళ్ళు కలవవనీ, నూనెలో కల్తీ ఉండదనీ, బియ్యంలో రాళ్ళుండవనీ, వైద్యుడు రోగనిదానం సరిగా చేస్తాడనీ, మందుల షాపులో అమ్మే మందులలో మోసం ఉండదనీ నమ్మి మనం జీవయాత్ర సాగిస్తాం. కాని ఈ విశ్వాసాలు ఎల్లప్పుడూ నిజం కావు. డబ్బు పోసి కొని తెచ్చిన నెయ్యి మర్నాటికల్లా కంపు కొట్టుతుంది. బడిలో పిల్లలకు ఒక్కొక్కసారి చదువు సరిగా ఉండదు. అలాటప్పుడు పదిమంది అనుభవాలు కలబోసుకుని, ఏ దుకాణంలో మంచి కిరాణాసరుకులు దొరుకుతాయో, ఏ డాక్టరు రోగిని చప్పున నయం చెయ్యగలడో, ఏ బడిలో పిల్లలకు నాలుగు ముక్కలు వంట బట్టుతున్నాయో తెలుసుకుని, సమిష్టి విశ్వాసాలను అవలంబిస్తాం. ఎవడికి వాడు నమ్మేవాటికన్నా పదిమంది ఏకంగా నమ్మేవి ఉపయోగకరమైన విశ్వాసాలు.

పదేపదే రుజువైన విశ్వాసాలే విజ్ఞానం అనిపించుకుంటాయి. ఫలాని ఆహారపదార్థాలలో పోషక పదార్థాలున్నాయి గనక అవి తింటే ఆరోగ్యం అన్నది అనేకమార్లు రుజువైన మీదట అది విజ్ఞానం కింద జమ అవుతుంది. అట్లాగే కొన్ని వ్యాధులకు కొన్ని మందులు వాడి తీరాలి. ఫలాని పంటల తెగుళ్ళకు ఫలాని విరుగుడు మందులు వాడాలి. ఫలాని పంటలకు ఫలాని రసాయనిక ఎరువులు వాడాలి. కాలం గడిచినకొద్దీ అనుభవం జాస్తి అవుతుంది. దానితోబాటు విశ్వాసాలు విజ్ఞానంగా మారడం జరుగుతుంది. గుడ్డి విశ్వాసాల స్థానంలో విజ్ఞానం రావటమే ప్రగతి. విజ్ఞానం లభ్యమవుతూండగా, దానికి విరుద్ధమైన విశ్వాసాలను నమ్మేవాళ్ళను మూఢులు అంటాం. అయితే మనిషి అవసరాలకు సరిపడినంత విజ్ఞానం లేని పరిస్థితిలో మనుషులు విశ్వాసాలను అవలంబించటం జరుగుతుంది. దేశం యొక్క శ్రేయస్సు యావత్తూ ఆధారపడిన ఎన్నికల వంటి వాటిలో విజ్ఞానం ఏమీ పని చెయ్యని కారణంగా విశ్వాసాలనే అనుసరించవలసి వస్తుంది.



# పవిత్రజలం

గోపాలపురం జమీందారు రత్నభూషణం తన పంట పొలాలు చూసుకోవడానికి గ్రామం వెళ్ళాడు. అతని పొలాలను రామయ్య అనే రైతు సాగు చేస్తాడు. ఆ పొలాలలో పండే ధాన్యం రామయ్య ఇంటనే నిలవ ఉంటుంది.

రామయ్య ఇంటి పక్కనే జమీందారు బసచేసే ఇల్లు ఉన్నది. రామయ్య కూతురు శాంత జమీందారుకు భోజనం ఏర్పాట్లు చేసింది. ఆమెను చూసి రత్నభూషణం ఆశ్చర్యపోయాడు. శాంత చాలా అందగత్తె. ఆమెకు ఇంకా పెళ్ళి కాలేదు. ఆమెను పెళ్ళాడాలన్న కోరిక జమీందారుకు బలంగా కలిగింది. ఆ సంగతి అతను రామయ్యతో అన్నాడు.

జమీందారు మాటవిని రామయ్య తెల్లబోయాడు. జమీందారు అప్పటికే ఇద్దరు పిల్లల తండ్రి.

"మీరు చెప్పేది నాకు అర్థంకాలేదు!" అన్నాడు రామయ్య ఆశ్చర్యం నుంచి తేరుకుంటూ.

"అర్థం కావడానికి ఏమున్నదీ? శాంతను నా రెండో భార్యగా చేసుకుంటాను," అన్నాడు రత్నభూషణం.

"నేను పేద వాణ్ణి అన్న అలుసుతో ఈ మాట అన్నారు! ఇది భావ్యం కాదు. ఈ సంగతి ఇంతటితో వదిలెయ్యండి!" అన్నాడు రామయ్య.

జమీందారుకు అహంకారం పొడుచుకు వచ్చింది. తనకు రెండో భార్యగా కూతురి నియ్యటానికి ఎవరూ అభ్యంతరం చెప్పరు. ఈ రామయ్యకు బాగా పొగరు పట్టింది!

రామయ్యను అడిగేదేమిటని, అతను ఒంటరిగా చూసి శాంతకే తన కోరిక చెప్పాడు. శాంత బెదిరిపోయింది.

ఎమ్. వి. వి. సత్యనారాయణ



రత్నభూషణం ఆమె చెయ్యి పట్టుకో బోతుండగా, "శాంతా!" అంటూ ఒక యువకుడు వచ్చాడు.

"బావా, ఎప్పుడు వచ్చావు?" అన్నది శాంత.

రత్నభూషణం ప్రశ్నార్థకంగా చూడడం గమనించి శాంత అతనితో, "ఇతను మా మేనబావ. పేరు మాధవ రావు. పట్నంలో చదువుకుంటున్నాడు, కాని వీళ్ళది కూడా ఈ ఊరే!" అన్నది.

రత్నభూషణం మాధవరావు వంకే చూస్తూ వెళ్ళిపోయాడు.

మాధవరావుకు శాంతనిచ్చి పెళ్ళిచేసే ఆలోచన అదివరకే జరిగిపోయింది. చిన్న తనంలోనే తల్లిని పోగొట్టుకున్న శాంత తన చెల్లెలి ఇంట అడుగు పెట్టితే సుఖ పడుతుందని రామయ్య ఉద్దేశం.

ఆ సాయంకాలం దీపాలు పెట్టాక రత్నభూషణం మరొకసారి శాంతను ఒంటరిగా కలుసుకుని, తనను పెళ్ళాడ మని బలవంత పెట్టాడు. శాంత అతనికి అందకుండా తప్పించుకుని పారిపోయింది. రత్నభూషణానికి కోపం ఎగదన్నింది. అతను బలంగా దీపాన్ని కాలితో తన్ని బయటికి వెళ్ళిపోయాడు. దీపంలో ఉన్న నూనె ఒలికి, అంటుకున్నది. క్షణాల మీద రామయ్య ఇల్లు అంటుకుని, కాలిపో సాగింది. చుట్టుపక్కల ఇళ్ళ వాళ్ళు వచ్చి మంటలు ఆర్పారు.

ఈ ప్రమాదం ఎలా జరిగినది శాంత రామయ్యకూ, మాధవరావుకూ చెప్పింది.

రత్నభూషణం గ్రామ పంచాయితీని సమావేశ పరచి, రామయ్య ఇంట భద్ర పరచిన తనపంట తగలబడిపోయినందుకు రామయ్య మీద వ్యాజ్యం తెచ్చాడు.

పంచాయితీ పెద్దలు విస్తుపోయి, "మీ పంటతో బాటు అతడి ఇల్లు కూడా కాలిపోయింది గదా! మీ పంటను తీసుకు రమ్మంటే ఎక్కడి నుండి తీసుకు రాగలడు? మీరు పంట విషయం మరచి పోవడం బాగుంటుంది," అన్నారు.

"నా పంట పోతే ఎలా ఊరు కుంటాను? నా పంట నాకు అప్పగించ వలసిన బాధ్యత అతని మీద ఉన్నది గదా!" అన్నాడు రత్నభూషణం.

గ్రామపెద్దలు చేసేది లేక, రామయ్యను పిలిపించారు.

రామయ్య పంచాయితీకి బయలుదేర బోతూ, శాంత చేతిని మాధవరావు చేతిలో పెట్టి, "నాయనా, శాంత కోసమే రత్నభూషణం ఈ ఎత్తు ఎత్తాడు. నేను ఏమైనా ఫరవాలేదు. శాంతను జాగ్రత్తగా చూసుకో!" అన్నాడు.



"మామయ్యా, నువు పంచాయితీకి పద. మేం కూడా వెనకగా వస్తాం," అన్నాడు మాధవరావు.

"వద్దు, నాయనా! ఏ కర్రన నిప్పు ఉంటే ఆ కర్రే కాలుతుంది," అని రామయ్య వెళ్ళిపోయాడు.

రామయ్య వెళుతూ, వెళుతూ అన్న మాటతో మాధవరావుకు ఒక ఆలోచన కలిగింది. అతను పట్నంలో చదువుతున్నది రసాయనశాస్త్రం. ఒక రసాయన ప్రయోగంతో రామయ్యను జమీందారు బారి నుంచి కాపాడవచ్చునని అతనికి తోచింది. వెంటనే అతను తాను చేయ తలచుకున్న ప్రయోగానికి అవసరమైన పరికరాలు సిద్ధం చేసుకుని, శాంతను వెంటబెట్టుకుని పంచాయితీ జరిగే చోటికి వెళ్ళాడు.

వాళ్ళు అక్కడికి చెరేసరికి, రత్నభూషణం తనకు శాంతనిచ్చి పెళ్లి చేస్తే రామయ్య మీద వ్యాజ్యం ఉపసంహరించుతానని రాజీబేరం చేస్తున్నాడు.

మాధవరావు పంచాయితీ సభ్యులకు నమస్కరించి, "ఒక్కసారి శాంత చెప్పేది కూడా వినండి," అన్నాడు.

శాంత జరిగినదంతా వివరించి చెప్పింది. కాని రత్నభూషణం అదంతా అబద్ధం అనేశాడు.

"పంటను ఎక్కడో దాచి, కాలిపోయి నట్టు నాటకం ఆడగలందులకు రామయ్య

గాని, శాంతగాని ఇల్లు అంటించి ఉండవచ్చు,'' అని కూడా రత్నభూషణం ఆరోపించాడు.

మాధవరావు పెద్దలతో, ''నిజం ఇలా తేలదు. నేరం చేసినది రామయ్యా, శాంతా, జమీందారులలో ఎవరో తేల్చే భారం దేవుడి మీద వేద్దాం. వారి ముగ్గురి పేర్లూ మూడు కాగితాల మీద రాసి, దాని మీద దేవుడి అభిషేక జలం చల్లితే నేరం చేసినది ఎవరైనదీ బయటపడవచ్చు!'' అన్నాడు.

అతను చెప్పిన పద్ధతిలో నేరం నిరూపణ అవుతుందని ఎవరికీ నమ్మకం లేదు. అయినా అలా చేసి చూడడానికి ఎవరికీ అభ్యంతరం లేకపోయింది. అలా నేరం రుజువు కాదన్న దృఢ నమ్మకంతో జమీందారు మాధవరావును మరింత గట్టిగా బలపరిచాడు.

మాధవరావు వెళ్ళి ఆలయం నుంచి అభిషేకజలం తెచ్చాడు. తరవాత అతను మూడు కాగితం ముక్కలు తీసి, వాటి మీద ముగ్గురి పేర్లూ రాశాడు. గ్రామపెద్ద ఉద్ధరిణతో అభిషేకజలాన్ని మూడు కాగితాల మీదా కొద్ది కొద్దిగా రాల్చాడు. అద్భుతంగా రత్నభూషణం పేరు ఉన్న కాగితం ఒక్కటే భగ్గున మండింది.

అందరూ హాహాకారాలు చేశారు రత్నభూషణం హడలిపోయి, తన తప్పు ఒప్పుకున్నాడు. పంచాయితీదార్లు అతని చేత రామయ్యకు నష్టపరిహారం ఇప్పించారు. రామయ్య ఆ డబ్బుతో శాంతను మాధవరావుకు ఇచ్చి పెళ్ళి చేశాడు.

తరవాత శాంత తన మొగుణ్ణి, ''జమీందారు పేరున్న కాగితం మండటానికి ఏం చేశావు?'' అని అడిగింది.

''పంచదారా, సూరేకారం కలిపి పూసిన కాగితం మీద జమీందారు పేరు రాశాను. అభిషేక జలంలో గంధకికామ్లం కలిపాను, ఆ ఆమ్లం ఆ కాగితానికి తగలగానే మండింది. మిగిలిన రెండూ మామూలు కాగితాలు. అందుచేత అవి మండలేదు,'' అన్నాడు మాధవరావు.






## 9

[చతుర్నేత్రుడూ, సమరసేనుడూ మాట్లాడుకుంటున్నప్పుడు, పొదల మాటున వుండి వింటున్న ఆటవికులను నల్లగూబా, నరవానరం వెంటాడినై. సమరసేనుడు, చతుర్నేత్రుణ్ణి ధనరాసులతోవున్న నావా, దాన్ని కాపలాకాస్తున్న నాగకన్య వృత్తాంతం అడిగాడు. చతుర్నేత్రుడు అతడికి శాక్తేయుణ్ణి, చండీదేవి కోరిన కోర్కె గురించి చెప్పాడు. తరవాత—]

శమనద్వీప రాజైన శాక్తేయుణ్ణి గురించి చతుర్నేత్రుడు చెప్పినది విన్న సమరసేనుడు చాలా అబ్బురపాటు చెందాడు. చండీదేవి తన దేవాలయాన్ని వెండీ, బంగారాలతో నిర్మించవలసిందిగా ఆజ్ఞాపించటం చాలా వింతగా కనబడింది.

దేవాలయాలను వెండీ, బంగారాలతో నిర్మించటం మానవమాత్రులకు సాధ్యమయే పని కాదుగదా!

''చతుర్నేత్రా, చండీదేవి అటువంటి దుస్సాధ్యమయిన పని తన భక్తుణ్ణి సాధించమనటం, నాకు చాలా ఆశ్చర్యం కలిగిస్తున్నది,'' అన్నాడు సమరసేనుడు.

చతుర్నేత్రుడు తల వూపుతూ బిగ్గరగా నవ్వి, ''సమరసేనా, నీకు శక్తిఉపాసన అంటే ఏమిటో తెలియదు. ఇహలోక సుఖాలనూ, తోడి మానవుల మీద అధికారాన్నీ కాక్షించే వారే, యిలాంటి శక్త్యు




నేనూ, ఏకాక్షి మాంత్రికుడు కూడా యింత బద్ధ శత్రువులం కావటానికి కారణాలు కూడా వివరిస్తాను. ఇంతకూ మూలం; ఆ శమనద్వీపంలోని చండీదేవి కోరిన కోరికా, దానికి శాక్తేయుడు తల వూపటమూనూ,'' అని చతుర్నేత్రుడు యిలా చెప్పసాగాడు:

శాక్తేయుడు దేవి కోర్కె నెరవేర్చాలని నిశ్చయించుకున్నాడు. ఒక రకంగా చూస్తే, అది కోర్కె అనేకన్న, దేవి ఆజ్ఞగానే భావించాలి. శాక్తేయుడు అంత వెండీ, బంగారం సంపాయించాలంటే, మీలాగానే పరరాజ్యాల మీదికి దాడి వెడలటం కన్న మరో మార్గం లెదు కదా?

శాక్తేయుడు సైనికుల కోసం దేశం నలుమూలలా గాలించసాగాడు. మంచి దేహబలం, ధైర్యసాహసాలూ గల యువకుల్ని ఏరి సైన్యంలో చేర్చుకో ప్రారంభించాడు. ఒక్కొక్క గ్రామానికీ వెళ్ళటం, అక్కడున్న యువకులందర్నీ పోగుచేసి, మల్లయుద్ధం, కత్తి, కర్ర సాముల్లో పోటీలు పెట్టేవాడు. ఇలాంటి పోటీల్లో నెగ్గిన కొద్దిమందిని మాత్రమే సైనికులుగా స్వీకరించేవాడు.

శాక్తేయుడు యీ విధంగా సైనికుల్ని సమాయత్త పరిచే నాటికి నేను ఇరవై ఏళ్ళ ప్రాయంగల యువకుణ్ణి. ఏకాక్షి

పాసకులవుతారు. దేవి వాళ్ళను కరుణించి ఆ శక్తులు ప్రసాదించే ముందు, వాళ్ళ ధైర్యసాహసాలనే గాక, తనమీద భక్తి బలాన్ని కూడా పరీక్షిస్తుంది. మా రాజయిన శాక్తేయుణ్ణి కూడా చండీదేవి యిలాంటి కఠిన పరీక్షకే గురి చేసింది,'' అన్నాడు.

''అయితే, శాక్తేయుడు అంత వెండీ, బంగారాలను సాధించగలిగాడా ?'' అని అడిగాడు సమరసేనుడు.

''అదే నే చెప్పబోతున్న అద్భుతకథ ! ఆ ధనరాసులతో నిండివున్న నావా, దాన్ని కాపలా కాస్తున్న నాగకన్య వృత్తాంత మంతా, యిందులోనే యిమిడి వున్నది.

కూడా నా వయసువాడే కాక, నేను వుండే పల్లెలోనే వుండేవాడు.

పోతే, యిక్కడ ఏకాక్షికీ, నాకూ వున్న బాల్యవిరోధం సంగతి చెప్పక తప్పదు. బాల్యంలో కలిగిన ఆ శత్రుభావమే, మా మధ్య అనేక దుశ్చర్యలకు దారితీసి, చివరకు యీ ద్వీపం మానవవాసయోగ్యం కాకుండా చేసింది. ఆ నాటికి ఏకాక్షి, నిజంగా ఏకాక్షి కాదు! ఈ ద్వీపం చేరిన తరవాతే, నా బంటు ఉలూకుడి వల్ల, ఆ ఏకాక్షితనం ప్రాప్తించింది.

ఏకాక్షి, నేనూ ఒకే పల్లెవాసులం అని చెప్పాను గదా? ఆ పల్లెలో మా యిద్దరి ఇళ్ళూ ఇరుగు, పొరుగునే వుండేవి. మాలో మొదటినుంచీ స్నేహభావం కన్న, శత్రుభావమే ఎక్కువపాలు వుండేది. కాని, అది యింత తీవ్రదశకు రావటానికి చాలాకాలం పట్టింది.

నేనూ, ఏకాక్షి కూడా మా ఆరవ ఏటినుంచి పశులకాపరులుగా జీవితం ప్రారంభించాం. మా పల్లెపెద్ద అయిన పతంగుడి మేకలను అడవిలో మేపుకు రావటం, మా పని. అప్పటికి మేం చాలా చిన్నవాళ్ళం కావటం వల్ల, అడవిలో వేటాడటానికి మాకు అర్హత లేదు. వయసువచ్చిన వాళ్ళూ, దృఢకాయులూ మాత్రమే వేటకు వెళ్ళేవారు.

ఒకనాడు నేనూ, ఏకాక్షి మరికొందరు కుర్రవాళ్ళం మేకలను అడవికి తోలుకు పోయాం. ఆ ప్రాంతమంతా దట్టమైన






చెట్లతో క్రిక్కిరిసి వుంటుంది. పైగా అది పెద్ద పులులకూ, సింహాలకే గాక, ప్రతి క్రూరమృగానికీ ఉనికి. అయినా పశువులను మేపేందుకు అంతకన్న మంచి ప్రదేశం, మా పల్లెప్రాంతాలలో లేదు.

మేకలను దూరంగా వదిలి, కాపరుల మందరమూ ఒక చెట్టుకింద కూర్చున్నాం. ఉన్నట్టుండి ఒక అందమైన లేడిపిల్ల, నాకు సంబంధించిన మేకల దగ్గిరకు వచ్చి అరవసాగింది. బహుశా అది తన తల్లి నుంచి వేరుపడి వుంటుంది.

ఆ లేడిపిల్లను చూడగానే, దాన్ని పట్టుకుని మచ్చిక చేయాలని పించింది. లేచి, ఒక్క గంతులో అక్కడికి వెళ్ళాను.

ఈ లోపల ఏకాక్షికూడా ఆ లేడిపిల్లను చూశాడు. వాడు, ''ముందు నే చూశాను. ఆ లేడి పిల్ల నాదే!'' అంటూ నా వెనక పరిగెత్తుకుంటూ వచ్చాడు.

నేను మాత్రం ముందు వెళ్ళి, ఆ లేడి పిల్లను పట్టుకున్నాను. నా దగ్గిర వున్న తాడును దాని మెడకు తగిలించి, లాక్కు వచ్చే ప్రయత్నంలో వున్నాను. ఇంతలో ఏకాక్షి నన్ను సమీపించి లేడిపిల్ల నాదంటూ, నా మీద కలియబడ్డాడు. నాకు పట్టరాని రోషం వచ్చి, అక్కడ వున్న ఒక రాయితో, అతడి తలమీద కొట్టాను. అరుస్తూ ఏకాక్షి కిందపడి పోయాడు.

ఈ లోపల లేడిపిల్ల మెడకు వున్న తాడుతో పారిపోసాగింది. నేను వెంట పడ్డాను. చెట్లల్లో, తుప్పల్లో పరిగెత్తి, పరిగెత్తి అఖరికి ఎలా అయితేనేం దాన్ని పట్టుకున్నాను. అప్పటికే నేను బాగా అలిసిపోయి వున్నాను. లేడిపిల్ల నా నుంచి పారిపోయేందుకు గుంజుకోసాగింది. నేను తాడు పట్టు వదలకుండా పెనుగులాడసాగాను.

ఆ పరిస్థితుల్లో నా గుండెలు అవిసేలా సింహగర్జన వినబడింది. అదీ చాలా సమీపం నుంచే! నేను ఒక్కగంతులో లేడిపిల్లను దాపులనున్న చెట్టుకు కట్టివేసి, చెట్టు కొమ్మల్లోకి ఎగబాకాను.

చెట్లకొమ్మల్లో కాస్త స్తిమితం చిక్కిన తరవాత గాని, నేను చేసిన పొరబాటు అర్థం కాలేదు. చెట్టుకు కట్టబడిన లేడి పిల్ల, మెడతాడు గుంజుకుంటూ అరవ సాగింది. ఒకవేళ సింహం దూరంగా పోతున్నా, యీ అరుపు విని తప్పక ఆ ప్రదేశానికి వస్తుందని, నాకు భయం కలిగింది. ఒకటి, రెండు నిమిషాల్లో సింహం అక్కడికి రానేవచ్చింది!

చెట్టుకొమ్మల్లో కూర్చున్న నాకు ప్రాణ భయం లేదు. కాని, కిందవున్న లేడి పిల్ల మీదికి సింహం లంఘించింది. భయంతో గగ్గోలు పెడుతున్న లేడిపిల్లను చూసి, నేను వూరుకోలేకపోయాను. చెట్టున ఎండివున్న ఒక కొమ్మను విరిచి, సింహం మీదికి విసిరాను. అదీ పెద్ద పొరబాటే! అప్పుడే సింహం తల ఎత్తి నన్ను చూసింది.

సింహం ముందు లేడిపిల్లను చంపి తినగలిగినంత తిన్నది. అలా తింటూనే, మధ్యమధ్య తలఎత్తి నా వంక చూడ సాగింది. చిట్టచివరకు చెట్టుమీద వున్న నన్ను పట్టాలని పైకి ఎగిరింది. నేను, అందకుండా మరికాస్త పైకి పోయాను.

అయినా సింహం తన ప్రయత్నం మానలేదు. సూర్యాస్తమయం అయే వరకు అది చెట్టుకిందనే కాపలావేసికూర్చున్నది.



ఆ రాత్రి నాకు నిద్ర పట్టలేదు. తెల్లవారిన తరవాత కూడా, నాకు చెట్టు మీదినుంచి దిగటానికి జంకు పుట్టింది. సింహం చెట్టుకింద లేకపోయినా, ఆ ప్రాంతాల్లోనే తిరుగుతూ వుంటుందని నాకు తెలుసు.

ఆ రోజు మిట్టమధ్యాహ్నం అయేసరికి, నా కర్ణపుటాలు బద్దలయేలా తప్పెటల మోత వినబడింది. అది మా పల్లెవాసులు నా కోసం వెతికేందుకు బయలుదేరారన్న దానికి సూచన! నా తోడి పశుల కాపరులు, నేను అడవిలోంచి తిరిగి రాలేదని, పల్లెలో చెప్పివుంటారు.

తప్పెటలమోత క్రమంగా సమీపించసాగింది. ఇక చెట్టుదిగి వాళ్ళకు ఎదురు వెళదామనుకున్నాను గాని, నాకు గుండె ధైర్యం చాలలేదు. నిన్నటి సింహం యింకా ఆ ప్రాంతాన కాపలా వేసి వుంటుందన్న అనుమానం వదలలేదు.

బరిసెలూ, ఈటెలూ ధరించిన ఒక నలభై, యాభై మంది మా పల్లెవాసులు అడవి మార్మోగేలా అరుస్తూ వస్తున్నారు. కొందరు తప్పెటలు వాయిస్తున్నారు. అందరూ సరిగా నేనున్న చెట్టుకు, ఒక యాభై గజాల దూరంలోకి వచ్చారు.

సింహాన్ని గురించి నేను అనుమానించినది నిజమే అయింది. పొదల మాటున దాగివున్న సింహం హఠాత్తుగా



వాళ్ళమీదికి దూకింది. ఇలాంటి ప్రమాదం జరగవచ్చని, మా పల్లెవాళ్ళు తగు జాగ్రత్తలోనే వున్నారు.

సింహం మీదికి దూకగానే వాళ్ళు చెల్లాచెదురు కాలేదు. దృఢకాయుడైన ఒక యువకుడు సింహం పంజాదెబ్బను తన చేతిలో వున్న పొడవాటి డాలుతో కాచుకున్నాడు. అదే సమయంలో మరొక యువకుడు, వెనక నుంచి దాని తోకను వడిసి పట్టుకున్నాడు.

సింహం గర్జిస్తూ వెనకకు తిరగబోయింది. ఇంతలో మొదటి యువకుడు బరిసెతో దాని మెడమీద బలంగా కొట్టాడు. దెబ్బతిన్న సింహం అరుస్తూ, తిరిగి

ముందుకు దూకబోయేసరికి, తోక పట్టుకుని వున్న యువకుడు చిన్న కత్తితో వెనకనుంచి దాని వెన్నుమీద పొడిచాడు.

సింహం బాగా గాయపడిపోయింది. ఆ యువకులిద్దరూ చేరి దాన్ని తమచేత నున్న ఆయుధాలతో ఎడాపెడా పొడిచారు. సింహం నేలపడి తన్నుకోసాగింది. చెట్టు కొమ్మల్లోవుండి, యిదంతా చూస్తున్న నాకు, పట్టరాని సంతోషం కలిగింది. గబగబా కొమ్మల చాటు నుంచి దిగివస్తూ, పెద్దగా కేక పెట్టాను.

ఆ క్షణంలో జరిగినవింత కళ్ళారా చూసిన నేనే నమ్మలేక పోయానంటే, లోకంలో ఎవరూ నమ్మరు. నేను అలా కేక పెట్టేసరికి, అందరూ తలలు ఎత్తి నా కేసి చూశారు. మరుక్షణంలో, తప్పెట వాయిస్తూ ముందున్న ఏకాక్ష, "దయ్యం! దయ్యం!" అంటూ వెనుదిరిగి, పరిగెత్త సాగాడు. కన్ను మూసి తెరిచేంతలో మిగతావాళ్లు కూడా, "దయ్యం! దయ్యం!" అంటూ చెల్లా చెదరయ్యారు.

ఇంతవరకూ చతుర్నేత్రుడు చెపుతున్న దంతా శ్రద్ధగా వింటున్న సమరసేనుడు, ఎంతో ఆశ్చర్యం కనబరుస్తూ. "ఇది చాలా చిత్రంగావున్నది. మిమ్మల్ని చూసి అంతమంది పెద్దవాళ్ళు కూడా దయ్యం అనుకుని పారిపోవటం ఏమిటి?" అన్నాడు.

చతుర్నేత్రుడు గట్టిగా పళ్ళు కొరికి. "ఇదంతా ఏకాక్ష చేసిన మోసం. వాడు దయ్యం అంటూ అరిచి పరిగెత్తటం ప్రారంభించేసరికి, మిగతావాళ్లు నా కేసి పరీక్షగా చూడకుండానే భయకంపితులై పోయి, అతణ్ణి అనుసరించారు. అంత చిన్న వయసులోనే ఏకాక్ష ఎంత కల్మష బుద్ధో, యీ ఒక్క సంఘటనవల్లా తెలుసుకోవచ్చు. మా పల్లెలోని పిన్న పెద్ద లందర్నీ, నేను దయ్యాన్నని నమ్మించ గలిగాడు. తరవాత పదేళ్ళపాటు నేను దయ్యంగానే అడవుల్లో తిరుగుతూ బతక వలసి వచ్చింది," అన్నాడు.

—(ఇంకావుంది)






# పిడుగుపాటు

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగి వెళ్ళి, చెట్టుపై నుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానం కేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఎవరి మనస్సు వాళ్ళకు తెలియదు. ఆలోచనలు మనసు లోతులను అందుకోలేవు. ఒక్కొక్కడు తాను ద్వేషించిన వాడి కోసం ప్రాణాలైనప్పటికీ త్యాగం చెయ్యటానికి సిద్ధపడతాడు. ఇందుకు నిదర్శనంగా ఇద్దరు అన్నదమ్ముల కథ చెబుతాను, శ్రమతెలియకుండా విను," అంటూ ఇలా చెప్పసాగాడు:

నాగభూషణుడూ, గంగాధరుడూ అని ఇద్దరు రైతు సోదరులు గర్భశత్రువులు. వారిద్దరి మధ్యా ఈర్ష్యవల్లనో, అసూయ వల్లనో, ఏ ఇతర అల్పకారణం వల్లనో ఏర్పడిన ద్వేషం ఆ రోజు కారోజు పెరిగి,

బేతాళ కథలు



క్రమంగా తీవ్రస్థాయికి చేరుకున్నది. చివరకు వాళ్ళు ఒకరి నాశనం ఒకరు మనస్ఫూర్తిగా కోరుకునే దశకువచ్చారు.

ఒకసారి, ఒక పశువుల మంద కొండ మీద మేసి దిగి వస్తూంటే, ఏపుగా పెరిగిన నాగభూషణుడి చేలోకి కొన్ని పశువులు ప్రవేశించాయి. ఇది కళ్లారా చూసిన గంగాధరుడు లోలోపల ఎంతో సంతోషించాడు. అయితే ఇంతలోనే పశువుల కుర్రవాడు పరిగెత్తుకుంటూ వచ్చి, వాటిని మళ్ళించాడు. ఈ సంగతి తెలిసి నాగభూషణుడు ఆ కుర్రవాణ్ణి కొట్టాడు. దాని మీదట గంగాధరుడు ఊరి వాళ్ళతో, "మా వాడు ఆ కుర్రవాణ్ణి కొట్టటం అహంకారం కాదా? నోరులేని పశువులు అకస్మాత్తుగా చేలోపడితే, వాడు ఏం చెయ్యగలడూ? అప్పటికీ వాడు చేలోపడిన పశువులను అదిలించి బయటికి తోలాడు. లేకపోతే చేను ఏమయేదో? కాకపోయినా, మా భూషణుడికి తన చేను విరగకాసిందని చాలా గర్వం! అలాటి వాణ్ణి దేవుడు అణచకపోడు!" అన్నాడు.

తన తమ్ముడు తనను గురించి ఇట్లా ప్రచారం చేసినట్టుతెలిసి నాగభూషణుడు మండిపడ్డాడు.

తరవాత కొద్ది రోజులకు గంగాధరుడు బండినిండా గడ్డి వేసుకుని, కొండదారి వెంట దిగి వస్తుండగా, ఒక ఎద్దు కాలు మడత పడి, నేలమీద పడింది. బరువు బండిని లేపటం తన ఒక్కడివల్లా కాక, గంగాధరుడు చుట్టుపక్కల చేలలో ఉన్న వాళ్ళను సాయం పిలిచాడు. ఎద్దుకాలు విరిగినట్టు తెలిసింది.

ఈ సంగతితెలిసి భూషణుడు లోలోపల పరమానందం చెంది, కనిపించిన ప్రతి వాడితోనూ, "పాపం, మా వాడి ఎద్దుకాలు విరిగిందటగా? అయినా ఆ భగవంతుడికి ఎవరి పొగరు ఎలా అణచాలో బాగా తెలుసు!" అన్నాడు.

ఈ సంగతి తెలిసి గంగాధరుడు అగ్గి మీద గుగ్గిలం అయాడు.

ఈ అన్నదమ్ముల భార్యలు తమ భర్త లకు ఏ విధంగానూ తీసిపోలేదు. అసలే తోడికోడళ్లు, దానికితోడు భర్తల మధ్య బహిరంగ శత్రుత్వం ఉండటంతో వాళ్ళు తమ ఈర్ష్యలను దాచుకునే అవసరం లేక పోయింది. వాళ్లు ఒకరి మీద ఒకరు ఇరుగు పొరుగు వారితో చాడీలు చెప్పు కునేవారు. ఇరుగు పొరుగువాళ్లు ఇక్కడి మాటలు అక్కడా, అక్కడివి ఇక్కడా చెప్పి, ఆతోడికోడళ్ళ మధ్య వైరం ఎగ దోశారు. తోడికోడళ్ళ మధ్య ఉండే శత్రుత్వం అన్నదమ్ముల శత్రుత్వానికి ఆజ్యంపోసింది!



ఒకసారి గంగాధరుడి భార్య ఏదో నగ చేయించుకుని మురిసిపోతూ, మాటల సందర్భంలో చుట్టు పక్కల వాళ్ళతో, "డబ్బున్న వాళ్ళందరికీ అనుభవించే యోగం ఉంటుందా ఏం?" అన్నది.

ఈ మాటకు చిలవలూ, పలవలూ చేరి నాగభూషణుడి భార్య చెవినపడింది. తన తోడికోడలు తనను గురించే ఈ మాటఅన్న దని నాగభూషణుడి భార్య అనుకుని, కంట తడిపెట్టుకుంటూ తన భర్తతో చెప్పింది.

"మనమేనా లేనివాళ్ళం? నాకు అంతకన్న అందమైన నగ కొంటే గాని దాని పొగరు అణగదు!" అన్న దామె.

నాగభూషణుడు భార్యను బలపరుస్తూ, తన భార్యకు ఖరీదైన నగ చేయించాడు. ఏదో పేరంటం సాకుపెట్టి నాగభూషణుడి భార్య తన ఇరుగు పొరుగుకు తన నగ చూపిస్తూ, "దీన్ని చూసి కళ్లలో నిప్పులు పోసుకునే వాళ్లు ఉంటారు!" అన్నది.

ఆ నోటా, ఆ నోటా ఈ మాట గంగా ధరుడి భార్యకు చేరింది. ఆమె ఈస డింపుగా, "గంగిరెద్దుకు కట్టిన గంతలా ఉన్నది, ఆ నగ! దాన్ని చూసి కళ్ళలో నిప్పులు పోసుకోవాలి కూడానా?" అని వ్యాఖ్యానించింది.

ఇటువంటి చిన్న చిన్న సంఘటనలు పాపం బద్దలైనట్టుగా పగిలి, తోడికోడళ్లు



ఒకరినొకరు శాపనార్థాలు పెట్టుకుని వీధిన పడటమూ, అన్నదమ్ములు కలియబడి తన్నుకోవటమూ కూడా జరిగేది.

ఇలా ఉండగా ఒక వర్షాకాలం కుంభ వృష్టిసాగింది. గంగాధరుడి ఇంటి దక్షిణపు గోడ బీటలు పడింది. ఇంటికప్పు చిల్లులు పడి కురుస్తుంటే, ఏదన్నా చేద్దామని గంగాధరుడు కప్పుమీదికి ఎక్కాడు. ఇంతలో కళ్ళు పోయేటట్టు మెరిసి, పెళపెళా రావాలతో పిడుగు పడింది. గంగాధరుడి కప్పు కొంతపోయింది.

గంగాధరుడి భార్య గొల్లున ఏడుస్తూ తన భర్తను కేకేసింది. జవాబులేదు. ఆమె ఆవేశంతో పక్క ఇంటికి వెళ్ళి, తన తోడికోడల్ని కౌగలించుకుని, "అక్కా, నీ మరిదిని కాపాడు!" అంటూ ఏడ్చింది.

ఆమె, కొయ్యబారి పోయినట్టున్న నాగభూషణుడితో, "చూస్తారేమండీ ? దీపం తీసుకుని రండి. మరిది ఏమయాడో, పాపం!" అన్నది.

ముగ్గురూ, దీపంతో కప్పుకూలిన చోటికి వెళ్ళారు. ప్రమాదకరమైన శిధిలాల మధ్య, తలకు ఏదో తగిలి, స్పృహలేకుండా పడి ఉన్న గంగాధరుణ్ణి, నాగభూషణుడు తన ఇంటికి తెచ్చాడు. వైద్యుడు వచ్చి చికిత్సచేసిన మీదట, గంగాధరుడు త్వరగానే కోలుకున్నాడు.

అటు తరవాత ఆ రెండు కుటుంబాల మధ్యా శత్రుత్వం అన్నది మచ్చుకైనా కనిపించలేదు. ఇది జరిగిన ఎంతో కాలానికి కూడా గంగాధరుడి భార్య, "ఆ నాడు మా బావగారు దేవుడల్లే వచ్చి నా పసుపూ, కుంకుమా నిలబెట్టారు!" అని సందర్భం వచ్చినప్పుడల్లా అంటూ ఉండేది.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఆ అన్నదమ్ముల మధ్య నిజంగా ఉన్నది శత్రుత్వమా, ఆత్మీయతా ? ఇద్దరూ ఒకరికి జరిగిన నష్టం గురించి ఇంకొకరు ఎంతో ఆనందం పొందేవారు గదా ? నాగభూషణుడు తన తమ్ముణ్ణి అపాయం

నుంచి రక్షించటానికి అలా ఎందుకు ముందుకు వచ్చాడు ? ఆ తరవాత వాళ్ల మధ్య వైరం అయిపులేకుండా ఎందుకు పోయింది ? ఈ సందేహానికి సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో నీ తల బద్దలైపోతుంది,'' అన్నాడు.

దానికి విక్రమార్కుడు, '' అభిమానంలాగే మనుషులమధ్య ద్వేషం కూడా ఒక తెంచరాని బంధం. నిర్లిప్తత ఉన్నచోట మాత్రమే ఏ బంధమూ ఉండదు. మనుషులు ద్వేషంద్వారా ఇతరులతో సంబంధం పెట్టుకుంటారు. అందుచేతనే ప్రేమానురాగాలు ఎంత గాఢంగా ఉండే అవకాశం ఉంటే, శత్రుత్వం కూడా అంత గాఢంగానే ఉంటుంది. అతి సన్నిహితులైన జ్ఞాతులూ, అన్నదమ్ములూ ఒకరినొకరు ద్వేషించుకున్నప్పుడు ఆ ద్వేషం మితిమీరుతుంది. అన్ని శత్రుత్వాలలోకీ గర్భశత్రుత్వం తీవ్రమైనది. గంగాధరుడు చచ్చిపోతే నాగభూషణుడికి ఆనందం కలుగుతుందనుకోవటం పొరపాటు. తమ్ముడి చావుతో తనకూ, అతనికీ ఉండే బంధం తెగినాక నాగభూషణుడికి మిగిలేది శూన్యమే! ఎందుచేతనంటే ఈ అన్నదమ్ముల మధ్య వైరం స్వార్థరహితమైనది. ఒకరు చస్తే ఇంకొకరికి లాభం చేకూరదు. అందుచేత గంగాధరుడి ప్రాణాలు కాపాడటం నాగభూషణుడికి చాలా సహజం. అటుతరవాత వారిమధ్య వైరం ఎందుకు లేదంటే అందుకు రెండు కారణాలు. ఒకటి, క్రోధంకన్న ప్రేమ శక్తివంతమైనది. ప్రేమకు చోటున్నచోట వైరం తల ఎత్తలేదు. రెండోది, ఉపకారం పొందిన వాడైనా తనకు జరిగిన మేలు మరవగలడేమో గాని, ఉపకారం చేసిన వాడు తాను చేసిన మేలును జన్మలో మరవలేడు. అన్నదమ్ము లిద్దరూ మేలు మరవలేని స్థితిలో ఉంటే, శత్రుత్వానికి తావు ఎక్కడ ? '' అన్నాడు.

రాజుకు ఈ విధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతో సహా మాయమై, తిరిగి, చెట్టెక్కాడు. —(కల్పితం)





# దొంగతనానికొక రాగం

శాస్త్రి ఆ ఊళ్ళో పేరున్న గాయకుడు. అయితే అతను ఎప్పుడూ నీలాంబరి రాగం ఒకటే పాడేవాడు. ఒకవేళ ఇతరులు మరో రాగం పాడమని అడిగినా, అతను బాగా పాడలేక పోయేవాడు. అందుచేత అతన్ని బాగా ఎరిగున్న వాళ్ళు అతనిచేత నీలాంబరి రాగమే పాడించుకుని విని తన్మయులయేవాళ్ళు. అంతే కాదు, అతను నీలాంబరి పాడితే రాళ్ళు కరుగుతాయని చెప్పుకునే వారు. రాళ్ళు కరిగేమాట ఏమైనా అతని నీలాంబరి గానం వినేవాళ్ళను జోకొట్టేది. ఆ రాగం వినేవాళ్ళ మీద మత్తుమందులా పని చేసేది.

అతను నీలాంబరి పాడి జనాన్ని జోకొట్ట గలడని అతని శత్రువులకు కూడా తెలుసు. అందుచేత, ఎవరన్నా, "శాస్త్రి లాగా నీలాంబరి పాడే వాళ్ళెవరూ లేరు! నే విన్నాగా?" అంటే "నీ మొహం! నువు నిద్రపోయి ఉంటావు!" అని అతనంటే మంచి అభిప్రాయం లేని వాళ్ళు విమర్శించే వాళ్ళు.

"అది తక్కువ సంగతా? సంగీతం పాడి నిద్రపుచ్చగల వాళ్ళెవరున్నారు ఈ కాలంలో?" అనే వాళ్ళు శాస్త్రి అభిమానులు.

"మా నాయనమ్మ రోజూ పాడి నన్ను నిద్రపుచ్చేది! దానికేమంటావు?" అని, శాస్త్రి అంటే కిట్టనివాడు ఒకడు అంటూండేవాడు.

ఏమైనా శాస్త్రి నీలాంబరి పాడితే ఎటువంటి వారికైనా నిద్ర ముంచుకొస్తుందన్నది ఆ ఊళ్ళో అందరూ ఒప్పుకునే మాటే.

ఒకరోజు శాస్త్రి కోసం ఒక మనిషి వచ్చాడు. అతను చూడటానికి పెద్ద

ఎస్. గీత

మనిషిలాగే ఉన్నాడు గాని, నిజానికి అతని వృత్తి దొంగతనం.

ఆ మనిషి శాస్త్రి చేతిలో కొంత డబ్బు పెట్టి, ఎంతో వినయంగా నమస్కరిస్తూ, "అయ్యా, రేపు రాత్రి తమరు పాటకచేరీ చెయ్యాలి. డబ్బు ముందే ఇచ్చేస్తున్నాను," అన్నాడు.

"రేపురాత్రిఎక్కడ?ఎన్నిగంటలకు?" అని శాస్త్రి అడిగాడు. అతను పాడినందుకు ఎవరూ ఇలా ముందుగా డబ్బు ఇచ్చి ఉండలేదు. అందుచేత అతను చాలా ఉత్సాహంలో ఉన్నాడు.

"రాత్రి పన్నెండు గంటలకు పాట ప్రారంభించాలి. పాటకచేరి ఎక్కడ జరిగేదీ ఇప్పుడు చెప్పలేను. రేపు రాత్రి నేను వచ్చి, మిమ్మల్ని తీసుకుపోతాను. నేను చెప్పిన చోట మీరు పాడుదురు గాని!" అన్నాడు ఆ మనిషి.

అర్ధరాత్రి వేళ పాటకచేరీ ఏమిటా అని శాస్త్రి ఆశ్చర్యపడ్డాడు గానీ, తన డబ్బు తనకు ముట్టింది గనక దాన్ని గురించి అతను అంతగా వితర్కించుకో లేదు.

మర్నాడు రాత్రి బాగా పొద్దుపోయి ఆ మనిషి తన తోడు దొంగను మరొకణ్ణి వెంట బెట్టుకుని వచ్చి ఖజానా ఉండే చోటికి తీసుకుపోయాడు.

ఖజానా సమీపంలో ఇద్దరూ కూర్చుని శాస్త్రి చేత ఆలాపన ప్రారంభింప జేశారు. ఆ పాటకు ఖజానా కాపలా వాళ్ళు నిద్రపోగానే, ఖజానాను కొల్లగొట్ట వచ్చునని దొంగల ఉద్దేశం.

అయితే ఆ కాపలా వాళ్ళు నేపాలు దేశస్థులు. వాళ్ళకు దక్షిణదేశపు సంగీతం పట్టదు.

శాస్త్రి పాడుతూనే ఉన్నాడు. తూర్పు తెల్లవారింది. దొంగలిద్దరూ ఎప్పుడో గురక పెట్టుతూ నిద్రపోయారు.

ఖజానా కాపలా వాళ్ళు వచ్చి, దొంగ లిద్దరినీ నిద్రలేపి, "ఇంకేం పాటలు! తెల్లవారింది. ఇళ్ళకు పొండి!" అని మందలించి పంపేశారు.





# అన్నీ ఒక్కసారికే!

రామాపురం జమీందారుకు లేక లేక కలిగిన బిడ్డ గోపాలుడు ఎంతో గారాబంగా పెరిగాడు. పదేళ్ళు వచ్చేసరికి వాడు ఉత్త బండవాడుగా, మొండి వాడుగా తయారయాడు, ఉదయానే లేవడు, ఎప్పుడూ స్నానం చేయడు. లేచినప్పటి నుంచీ వాడికి ఆటలు తప్ప మరొక ధ్యాస ఉండదు. ఏదో సమయంలో వచ్చి, ఇంత తిండి తినిపోతాడు. అంతే!

తన కొడుకు స్థితి శ్రుతి మించి రాగాన పడుతున్నదని భయపడి వాడికి నయనా, భయానా చెప్పి చూశాడు జమీందారు. కాని, పని జరగలేదు. పిల్లవాడు ఇంట్లో వాళ్ళమాట వినడంలేదని, ఆయన ప్రసిద్ధులైన గురువులను నియమించాడు. వాళ్ళ వల్ల కూడా ఏమీకాలేదు.

అలాటి పరిస్థితులలో ఆ ఊరికి కొత్తగా, ఒక యువకుడు వచ్చాడు. వాడు అనాథ. జమిందారు ఆ యువకుణ్ణి పిలిచి, ''నువు నా కొడుక్కు మంచి బుద్ధులు నేర్ప గలిగితే నీకు మా ఇంట్లో శాశ్వతంగా తిండీ, బట్టా ఏర్పాటుచేస్తాను,'' అన్నాడు.

కొత్త యువకుడు గోపాలుడితో స్నేహం చేసుకుని, రకరకాల కథలతోనూ, కొత్త కొత్త ఆటలతోనూ వాణ్ణి ఆకర్షించాడు. గోపాలుడు వస్తుతః తెలివైన వాడేననీ, వాడి దృష్టి చదువు మీదికి మళ్ళేటట్టు చెయ్యగలిగితే బాగుపడతాడనీ యువకుడికి తోచింది. అయితే యువకుడు ఎంత చెప్పినా గోపాలుడు మారక, ''నా కిలాగే బాగున్నది. నే నెందుకు మారాలి?'' అని అడిగాడు.

''ఏదైనా అనుభవిస్తేనేగాని తెలియదు. రోజుకు ఒక్కసారి స్నానం చేసి చూడు, ఒక్కసారి చదివి చూడు, ఒక్కసారి పెద్ద వాళ్ళకు నమస్కారం చేసి చూడు!

"వసుంధర"

నీ మనసుకు ఎంత హాయిగా ఉంటుందో నీ కే తెలుస్తుంది,'' అన్నాడు యువకుడు.

''నువ్వంటే నా కిష్టం గనక, నువు చెప్పావు గనక వింటాను. అయితే నువు చెప్పినవన్నీ రోజుకు ఒకసారే చేస్తాను: రోజూ పెందలాడే లేస్తాను, ఒక్కసారి స్నానం చేస్తాను. పుస్తకంలో ఒక్కపుట చదువు కుంటాను; ఆ తర్వాత నన్ను నువు రోజంతా ఆడించాలి,'' అన్నాడు గోపాలుడు.

యువకుడు జమీందారుకు గోపాలుడు అన్న మాటలు చెప్పాడు.

''ఇదీ కొంత మెరుగే! ఒకసారి క్రమ బద్ధమైన జీవితానికి అలవాటు పడితే, వాడే మారుతాడు,'' అని జమీందారు సంతోషించాడు.

మర్నాటి నుంచీ గోపాలుడు, అన్న మాట ప్రకారం, రోజూ పెందలాడే నిద్ర లేచి, స్నానం చేసి, పుస్తకంలో ఒకే ఒక్క పుట చదివి, తండ్రికి ఒకమారు నమస్కారం చేస్తూ వచ్చాడు. ఆ తర్వాత రోజంతా ఆటలే!

ఒకరోజు జమీందారు బంధువు ఒకాయన చూడవచ్చి, గోపాలుడు రోజల్లా ఆటపాటల్లో మునిగి తేలుతూండడం చూసి, ''కుర్రాడికేమైనా చదువు చెప్పిస్తున్నావా?'' అని జమీందారును అడిగాడు.



''వాడు రోజూ పెందలాడి లేస్తూనే స్నానం చేసి, పెద్దలకు నమస్కారం చేసి, చదువుకుంటాడు, ఆ తర్వాత ఆడు కుంటాడు,'' అని తన బంధువుతో గర్వంగా చెప్పి, కొడుకును పిలిచి, ''ఈయన నీకు పెద్దనాన్న అవుతారు! నిన్ను చూడాలని వచ్చారు. ఆయన పాదాలకు నమస్కారం చెయ్యి, నిన్ను దీవిస్తారు!'' అన్నాడు జమీందారు.

గోపాలుడు నిరసనగా తల ఆడించి, ''నేను రోజుకు ఒక్కసారి మాత్రమే ఎవరికో ఒకరికి నమస్కారం చేస్తాను. ఈ రోజుకు మీకు నమస్కారం చేసేశాను. కావాలంటే రేపు ఉదయం మీకు మానేసి



ఈయనకు నమస్కారం చేస్తాను! ఇవాళ మాత్రం ఇంకెవరికీ నమస్కారాలు లేవు!'' అని వెళ్ళిపోయాడు.

జమీందారుకు తల తీసేసినట్టయింది. ఆయన యువకుణ్ణి పిలిచి, ''నువు గోపాలుడికి ఇస్తున్న శిక్షణ వల్ల బంధు వర్గంలో నా పరువు పోతున్నది!'' అని, జరిగినది చెప్పాడు.

యువకుడు గోపాలుడి వద్దకు వెళ్ళి, ''నీ మూలంగా నాకు చెడ్డపేరు వచ్చింది! పెద్దలకు నమస్కరించడం మర్యాద! వారి దీవెనలు పొందడం నీకే మంచిది! ఇకమీదట ఈ రోజులా ప్రవర్తించకు!'' అని మందలించాడు.

కాని గోపాలుడు నిర్లక్ష్యంగా, ''నేను అన్నమాట తప్పను. ఒక్కసారి అన్నానంటే ఒక్కసారే!'' అన్నాడు.

''పెద్ద హరిశ్చంద్రుడివి బయలుదేరావు! అన్నమాట తప్పవా? తప్పితే?'' అన్నాడు యువకుడు.

''తప్పితే, ఆ తర్వాత నువు ఎలా చెబితే అలాచేస్తాను,'' అన్నాడు గోపాలుడు.

యువకుడికి గోపాలుణ్ణి మార్చే ఉపాయం స్ఫురించింది. ఆ రోజే అతను ఆటల నెపంతో గోపాలుడి శరీరం మురికి చేసేశాడు. గోపాలుడి శరీరం దుర్వాసన కొట్టసాగింది. ఆ సంగతి వెంటనే గ్రహించలేదు గాని, తరవాత వాడు ఆ వాసన భరించలేకపోయాడు.

యువకుడు గోపాలుడితో, ''పద, నదికి పోయి స్నానం చేద్దాం!'' అన్నాడు.

''స్నానం ఎలా చేస్తాను? ఈ రోజుకు స్నానం చేసేశాను గద! ఇవాళ్టికి మరి స్నానం లేదు!'' అన్నాడు గోపాలుడు.

యువకుడు స్నానంచేసి వచ్చాడు. గోపాలుడు అలాగే ఇంటికి వెళ్ళాడు.

''నీ ఒళ్ళంతా వాసనరా! వెళ్ళి స్నానం చేసిరా,'' అన్నది గోపాలుడి తల్లి. గోపాలుడు ఒప్పుకోలేదు. తన చేత బలవంతాన స్నానం చేయించేటట్టుంటే భోజనం చెయ్యనన్నాడు.

"మరి నీతో కలిసి భోజనం చేసేది ఎలారా? ఇంట్లో చుట్టాలు కూడా ఉన్నారు!" అన్నది గోపాలుడి తల్లి.

గోపాలుడు ఆ పూట వేరే భోజనం చేసి, పక్కపాడైపోతుందని కటిక నేల మీద పడుకున్నాడు. అంతేగాని వాడు స్నానం చెయ్యలేదు.

తన ప్రయత్నం విఫలమయిందని యువకుడు జమీందారుకు చెప్పాడు.

తన కొడుకు నలుగురితో గాక వేరే భోజనం చేశాడనీ, కటిక నేలమీద పడుకున్నాడనీ బాధపడి జమీందారు యువకుడితో, "ఇంకెప్పుడూ ఇలాంటి ప్రయోగాలు చేయకు. వాడు బాగుపడకపోతే మానె!" అన్నాడు.

కాని గోపాలుడు బాగుపడడం యువకుడికి అవసరం. గోపాలుడు బాగుపడకపోతే, జమీందారు అతనికి శాశ్వతంగా ఆశ్రయం ఇయ్యడు! జమీందారు చేసే అతి గారాబం వల్లనే గోపాలుడు చెడిపోతున్నాడని యువకుడికి అర్థమయింది.

ఇలా ఉండగా, ఆ దేశాన్ని ఏలే రాజుగారు ఆ గ్రామం వచ్చి విడిది చేశారు. ఊళ్ళోని పెద్దలందరూ కుటుంబసహితంగా కానుకలతో వచ్చి రాజుగారి దర్శనం చేసుకుంటున్నారు. జమీందారు కూడా సకుటుంబంగా, యువకుణ్ణి కూడా వెంట బెట్టుకుని రాజదర్శనానికి వెళ్ళాడు.

జమీందారు ఇచ్చిన కానుక రాజుగారికి నచ్చింది. ఆ సమయంలో యువ



కుడు గోపాలుడితో, ''వీరు మన రాజు గారు. వీరికి నమస్కారం చెయ్యి,'' అన్నాడు.

గోపాలుడు తన అలవాటు చొప్పున పెంకెగా సమాధానం చెప్పాడు.

రాజుగారికళ్ళుకోపంతో ఎరుపెక్కాయి. ''రోజుకు ఒక్కసారే నమస్కారం చేస్తావా? రాజు ఎదురైనా రెండోసారి నమస్కారం చెయ్యవూ? ఎవరు నేర్పారు నీకిలాంటి మాటలు?'' అన్నాడాయన.

రాజుకు తన కొడుకు మీద వచ్చిన కోపం ఎలాంటి విషమపరిణామాలకు దారి తీస్తుందోనని జమీందారు భయపడి, వెంటనే కొడుకును చాచి చెంపకాయ కొట్టి, ''నీ పెంకెతనానికి హద్దు లేకుండా ఉన్నది! దేవుడిలాటి రాజుగారికి నమస్కరించనంటావా? ముందు ఆయన కాళ్ళమీద పడు!'' అన్నాడు.

తండ్రికి తనమీద అంత కోపం రావడం కానీ ఆయన తనను అంత దెబ్బ కొట్టడం కానీ ఎన్నడూ ఎరగని గోపాలుడు హడలి పోతూ, చప్పునపోయి, రాజుగారి కాళ్ళ మీద పడ్డాడు.

రాజుగారు ప్రసన్నుడయాడు.

తిరిగి ఇల్లు చేరుకున్నాక, యువకుడు గోపాలుడికి వాడు చేసిన ప్రతిజ్ఞ జ్ఞాపకం చేసి, జమీందారుతో, ''మీ వాడు అన్న మాట తప్పడు! ఈ రోజు నుంచీ నేను చెప్పినట్టు వింటాడు. ఎందుకంటే ఇవాళ రెండు సార్లు నమస్కారం చేశాడు గద! గోపాలుడి వైఖరి ఎంత ప్రమాదకరమైనదో ఇవాళ మీరే చూశారు. మీ కుర్రవాణ్ణి కాపాడడానికి ఇంకో దారి లేదనేవరకూ మీరు వాడి మీద చెయ్యి చేసుకోలేదు. ఆ సంగతి తెలిసే, నేను ఇవాళ ఇలా ప్రవర్తించవలసి వచ్చింది. మీ మనసును కష్టపెట్టితే, క్షమించండి!' అన్నాడు.

గోపాలుడు అన్నమాట నిలబెట్టుకుని, బుద్ధిమంతుడు కావడంతో జమీందారు కూడా తాను అన్నమాట నిలబెట్టుకుని, ఆ యువకుడికి తన ఇంట శాశ్వతంగా వసతి ఏర్పాటు చేశాడు.





# తల్లిఋణం

బ్రహ్మదత్తుడు కాశీరాజ్యాన్ని పాలించే కాలంలో, బోధిసత్వుడు ఒక అందాల గిత్తగా పుట్టాడు. ఆ గిత్త నల్లని నిగనిగలాడే రంగుతో, చూడముచ్చటగా వుండేది. దాని అందం చూసి, దాని యజమానులతో పాటు యితరులు కూడా ఎంతో మురిసిపోయేవారు.

ఆ గిత్తను పెంచే యజమానులు ఒక పేదరాశి పెద్దమ్మ ఇంటి భాగంలో కాపరం వుంటూ వచ్చారు. కొన్నాళ్ళ తరవాత వాళ్ళు, ఆ ఊరు వదిలి పోవలసి వచ్చింది. వాళ్ళు పేదరాసి పెద్దమ్మకు ఇంటిఅద్దెకింద, ఆ నల్లగిత్తను యిచ్చేశారు.

పెద్దమ్మకు నా అన్నవాళ్ళెవరూ లేరు. ఆమె ఆ నల్లగిత్తనే బిడ్డలా చూసుకుంటూ రాసాగింది.

బియ్యపు కడుగూ, గంజినీళ్ళూ కలిపి, అందులో తౌడు వేసి మంచి కుడితి తయారుచేసి, పెద్దమ్మ నల్లగిత్త చేత తాగించేది. రోజూ కాలవకు తీసుకుపోయి మెత్తని గడ్డిపరకలతో దాని ఒళ్ళంతా తోమి, శుభ్రంగా కడిగేది. ఇంత ముద్దుగా పెంచుకుంటున్న ఆ గిత్తను పెద్దమ్మ ఏనాడూ కట్టుకొయ్యకు కట్టివేసి ఎరగదు.

నల్లగిత్త ఎదుగుతున్న కొద్దీ, దానికి చిట్టికొమ్ములు మొలుచుకు వచ్చినై. అది తోడి పశువులలో ఊరంతా స్వేచ్ఛగా తిరిగేది. పిల్లలు దానిమీద ఎక్కి స్వారీ చేసేవాళ్ళు. దాని గంగడోలు దువ్వి దానితో ఎన్నో ఆటలు ఆడేవారు.

ఒకరోజున నల్లగిత్త తనలో యిలా అనుకున్నది: "నన్ను పెంచే పెద్దమ్మ కడు పేదరాలు. నా కోసం ఎంతో శ్రమ పడుతున్నది. నే నామెకు కొంత ధనం సంపాయించి పెట్టగలిగితే, ఆమె శ్రమ చాలావరకు తగ్గించిన దానినవుతాను!"

ఇటువంటి ఆలోచన కలగగానే, అది ధనం సంపాయించే మార్గాలకోసం వెదక సాగింది. ఆ స్థితిలో ఒక రోజున, ఐదు వందల బండ్లపైన ధాన్యం వేసుకుని వర్తకుడొకడు, ఆ ఊరు కేసి బయలు దేరాడు. బళ్ళన్నీ మామూలు బాటలో ఎలాంటి చిక్కులూ లేకుండా కదిలినై. కాని, ఒకచోట అవి చిన్న ఏరు దాటవలసి వచ్చింది. ఆ ప్రాంతమంతా ఇసుక మయం.

ఆ ఇసుకలో బళ్ళవాళ్ళు ఎంత ప్రయత్నించినా ఎడ్లు బండ్లను లాగలేక పోయినై. ఆ కారణంగా అన్ని బళ్ళూ ఏటిపక్కన ఆగిపోవలసి వచ్చింది. ఊరి నుంచి ఎడ్లను తీసుకుపోయి, బళ్ళను లాగించాలని చూశారు. కాని, ఆ ప్రయత్నం ఫలించలేదు.

ఆ సమయంలో బోధిసత్వుడైన నల్ల గిత్త, ఏటికి ఆవలిగట్టున మరికొన్ని పశువులతో కలిసి మేతమేస్తున్నది. ఆ పశువులలో తన అవసరానికి పనికి వచ్చే ఎద్దులేమైనా వున్నవేమో అని చూసేం దుకు, వర్తకుడు తన మనుషులతో అక్కడికి వచ్చాడు.

ఆ వర్తకుడి దృష్టిని బలంగా, చలాకీగా వున్న నల్లగిత్త ఆకర్షించింది. "ఈ నల్లగిత్త చాలా అసామాన్యంగా కనిపిస్తు న్నది. దీని సాయంతో నా బండ్లను సులువుగా ఏరు దాటించవచ్చు." అను కున్నాడు వర్తకుడు.



వర్తకుడు, అక్కడ వున్న పశువుల కాపరి కుర్రవాళ్ళను పిలిచి, "ఒరే, ఈ నల్లగిత్త ఎవరిది? దీన్ని కొంచెం సేపు ఎరువిస్తారా? బళ్ళను ఏరు దాటించాలి. కోరిన ధనం యిస్తాను," అన్నాడు.

"గిత్తను తోలుకుపోయి మీ బళ్ళు లాగించుకోండి. దీనికి యజమాని అంటూ ఎవరూ లేరు. అలా ఇష్టం వచ్చిన చోటు నల్లా తిరుగుతూంటుంది," అన్నారు పశువుల కాపరి కుర్రవాళ్ళు.

వర్తకుడు గిత్త మెడకు తాడు కట్టించి దాన్ని అక్కడినుంచి లాక్కుపోవాలని చూశాడు. కాని, నల్లగిత్త ఒక్క అంగుళ మైనా కదలలేదు. దాన్ని ఈడ్చుకు పోవడం వర్తకుడి మనుషులవల్ల కాలేదు.

వర్తకుడు కొంచెం సేపు ఆలోచించి, బహుశా యీ గిత్త తన కష్టానికి ప్రతి ఫలం ఆశిస్తూండాలి, అనుకుని, నల్ల గిత్తతో, "నీ రూపురేఖలు చూస్తుంటే, వృషభరాజులా వున్నావు! నా ఐదు వందల బళ్ళనూ ఏరు దాటించు. బండి ఒక్కంటికి రెండేసి వరహాల చొప్పున వేయి వరహాలు నీకు బహుమానంగా యిచ్చుకుంటాను," అన్నాడు.

వర్తకుడు యిలా అనగానే నల్లగిత్త కదిలి, ఏటి ఒడ్డున వున్న బళ్ళ దగ్గిరకు పోయి నిలబడింది. వర్తకుల మనుషులు దానిని ఒక బండికి కట్టారు. గిత్త సునా యాసంగా బండిని అవతలి గట్టుకు లాక్కుపోయింది. ఇలా ఐదువందల



బళ్ళనూ అది కొద్ది సేపట్లో అవతలిగట్టుకు చేర్చింది.

తన పని తీరగానే వర్తకుడు ఒక పాడ వాటి పట్టీలోపల ఐదువందల వరహాలు పెట్టి, ఆ పట్టీని నల్లగిత్త మెడకు కట్టాడు. వర్తకుడి మోసం గ్రహించిన బోధిసత్త్వుడు, "ఈ వర్తకుడికి దుర్బుద్ధి పుట్టింది. మాట తప్పాడు!" అనుకుని ఏటిగట్టున తాను మొట్టమొదట చేర్చిన బండికి అడ్డుగా నిలబడి, అటకాయించాడు.

దానితో వర్తకుడికి, నల్లగిత్త మామూలు పశువు కాదనీ, మహత్తు గలదనీ అర్థమైంది. అతను మరొక ఐదువందల వరహాలు యింకొక పట్టీలో పెట్టి, దాన్ని గిత్తమెడకు బిగిస్తూ, "అయ్యా నన్ను క్షమించు. నేను వాగ్దానం చేసిన వెయ్యి వరహాలూ నీ మెడకు కట్టాను. ఇక, నా బండ్లు గ్రామానికి పోయేందుకు దారి వదులు," అన్నాడు.

గిత్త అక్కడినుంచి బయలుదేరి, సరాసరి తనను ఇంతకాలంగా సాకుతున్న పెద్దమ్మ దగ్గరకు పోయింది. ఐదువందల బండ్లను ఏటియిసుకలో లాగిన కారణంగా ఆ సమయంలో అది బాగా అలిసిపోయి వున్నది. అది గమనించిన పెద్దమ్మ దాని శరీరాన్ని గుడ్డతో తుడుస్తూ, మెడ దువ్వుతున్నంతలో ఆమెకు మెడకు కట్టివున్న పట్టీలు కనిపించినై.

వాటిని ఊడదీసి చూడగా పెద్దమ్మకు వరహాలు కంటబడినై. ఆమె ఆశ్చర్యపోతున్నంతలో గొడ్లకాపరి కుర్రవాళ్ళు అక్కడికి వచ్చి, జరిగింది చెప్పారు.

పెద్దమ్మ కళ్ళనీళ్ళు పెట్టుకుని, గిత్త తల నిమురుతూ, "తండ్రీ, నా కోసం ఎంత శ్రమపడ్డావు! ఈ డబ్బంతా నేనేం చేసుకుంటాను?" అని, అప్పటికప్పుడు దాని ఒంటి నొప్పులు పోయేందుకు నూనె రాసి, వేడినీళ్లతో కడిగింది.

ఈ విధంగా బోధిసత్త్వుడు తననెంతో ప్రేమగా పెంచిన తల్లిఋణం తీర్చిన కొంత కాలానికి, నల్లగిత్త అవతారం చాలించాడు.





# మహాకవి కాళిదాసు

కౌమారప్రాయంలో వున్న యువరాజొకడు తల్లిదగ్గిరకు వచ్చి, "అమ్మా, నాకు తక్షణం కత్తి ఒకటి యివ్వు!" అన్నాడు. తల్లి ఎందుకని అడిగింది. "యుద్ధం చేయటానికి," అన్నాడు యువరాజు. తల్లి నవ్వి, "మరికాస్త పెరిగి, పెద్దవాడివై కత్తిపట్టే వయసు రానీ," అన్నది.

ఆ యువరాజే విక్రమాదిత్యుడు! మధ్య ఆసియా నుంచి దాడి వచ్చి, భారత దేశంలో రాజ్యాలు స్థాపించిన శకు లనే భయంకరజాతి వాళ్ళను, అతడు యుద్ధంలో చిత్తుగా ఓడించాడు.





ఆ తరవాత విక్రమాదిత్యుడు అనేక పరరాజ్యాలు జయించి, తన రాజధానీ నగరాన్ని పాటలీపుత్రం నుంచి ఉజ్జయినికి మార్చాడు. అతడి పాలనలో ఉజ్జయిని గొప్ప గొప్ప భవనాలతో, దేవాలయాలతో కన్నులపండువ చేసింది.



విక్రమాదిత్యుణ్ణి గురించి అనేక అద్భుత గాధలు ప్రచారంలో వున్నవి. అందులో ముఖ్యమైన దొకటి, మహా కవి కాళిదాసును గురించినది. ఒకా నొక రాజకుమారి (విక్రమాదిత్యుడి కుటుంబం కాదు) వాదంలో తనను గెలిచినవాణ్ణే, వివాహమాడతానని పట్టు పట్టి కూర్చున్నది. అనేకమంది పండితులు ఆమెతో వాదించి, ఓడిపోయారు.

అవమానం పాలైన పండితులు, రాజ కుమారికి పరమ మూర్ఖుణ్ణి భర్తగా తేవాలని పథకం వేశారు. వాళ్ళకు ఒక ప్రదేశాన నరికే చెట్టుకొమ్మపై కూర్చుని, దానితోపాటు నేలపడిన మూర్ఖుడొకడు కనిపించాడు. వాళ్ళు, వాణ్ణి రాజ ప్రాసాదానికి తీసుకుపోయారు.





కల్లబొల్లి మాటలతో పండితులు రాజ కుమారి తల్లిదండ్రులను ఆ మూర్ఖుడు గొప్ప పండితుడని నమ్మించారు. వివాహం జరిగిపోయింది. తన భర్త ఒట్టి మూర్ఖుడని గ్రహించిన రాజ కుమారి, అతణ్ణి రాజప్రాసాదం నుంచి తరిమివేసింది.

ఇలా భంగపాటు పొందిన మూర్ఖ వరుడు, ఒక కాళీదేవాలయానికి పోయి, దేవిని ఎంతో భక్తిశ్రద్ధలతో ప్రార్థించాడు. దేవి ప్రత్యక్షం కాలేదు. బ్రతుకు పై విరక్తికలిగి అతడు, దాపులనున్న నదిలో దూకి చావదలిచాడు.





ఆ మరుక్షణం కాళీదేవి, సరస్వతీ అవతారంలో అతడికి ప్రత్యక్షమై, "నీకు రాబోయే ఏడు జన్మల్లోనూ పండితుడవయే అదృష్టం లేదు," అన్నది. అతడు తిరిగి నదిలో దూకి ఆత్మహత్య చేసుకోదలిచాడు.

దయార్ద్రహృదయురాలైన దేవి అతణ్ణి కరుణించి, అతడు అక్కడికక్కడే ఏడు జన్మలు ఎత్తి, దేహంచాలించేటట్టు చేసి, దీవించింది.





ఈ విధంగా దేవి అనుగ్రహం వల్ల ఉద్దండ పండితుడైన అతడు, దేవిని స్తుతిస్తూ శ్లోకం చదివి, తన పేరు కాళిదాసుగా మార్చుకున్నాడు. తరవాత విక్రమాదిత్యుని ఆస్థానానికి వెళ్ళాడు.

విక్రమాదిత్యుడి ఆస్థానంలో నవరత్నాలని పిలవబడే పండితుల్లో కాళిదాసు ఒక డయ్యాడు. మిగిలినవారు: ధన్వంతరి, క్షపణకుడు, అమరసింహుడు, శంఖుడు, బేతాళభట్టు, ఘటకర్పకుడు, వరాహమిశ్రుడు, వరరుచి.





ఒకసారి విక్రమాదిత్యుడికి ఏ కారణం వల్లనో కాళిదాసుపై కోపంవచ్చి, అతణ్ణి రామగిరి పర్వతప్రాంతాలకు బహిష్కరించినట్టు ఐతిహ్యం వున్నది. ఇక్కడే కాళిదాసు సుప్రసిద్ధమైన మేఘసందేశ కావ్యాన్ని రాశాడు. తరవాత రాజు అతడి స్నేహాన్ని మరవలేక, పిలిపించి, గొప్పగా సన్మానించాడు.

# తిరుగులేని అబద్ధం!

ఒక రాజుగారు వినోదప్రియుడు. అందుచేత ఆయన ఆస్థానంలో విదూషకుడికి హెచ్చు గౌరవం జరుగుతూ ఉండేది. అందుచేత ఆస్థానపండితుడైన రామశర్మకు విదూషకుడంటే చాలా ఈర్ష్యగా ఉండేది. పాండిత్యం దాదాపు ఏమీ లేని ఆ విదూషకుడికి రాజుగారు చీటికీ, మాటికీ అగ్రస్థానం ఎందుకిస్తాడో రామశర్మకు అర్థం అయేదికాదు.

ఒక రోజు రాజుగారు అందరికన్నా గొప్ప అబద్ధం చెప్పిన సభికుడికి బహుమానం ప్రకటించి, అబద్ధాల విలువను నిర్ణయించే పని విదూషకుడికి అప్పగించాడు.

సభలో ప్రతి ఒక్కరూ తమకు గొప్ప అబద్ధమని తోచినది చెప్పసాగారు. కొందరు తెల్ల కాకులను చూశామన్నారు. మరి కొందరు ఎగిరే మనుషులున్నారన్నారు. అందరు చెప్పే అబద్ధాలూ వింటూ విదూషకుడు, సభలో ముఖంమాడ్చుకుని కూర్చుని ఉన్న రామశర్మను చూసి, "మహాకవీ, తమరు కూడా ఈ పోటీలో పాల్గొంటే బాగుంటుంది," అన్నాడు.

రామశర్మ రుసరుసలాడుతూ, "అబద్ధాలాడటం మా వంశంలో ఎవరికీ తెలియదు. అలాటిది మా ఇంటావంటా లేదు," అన్నాడు.

విదూషకుడు రాజు కేసి తిరిగి, "మహారాజా, బహుమానం రామశర్మగారికి ఇప్పించండి!" అన్నాడు.

అందరూ గొల్లున నవ్వారు.

—పెంటకోట సోమినాయుడు





# పటిక-బెల్లం

కొత్తగా ఉద్యోగం మీద ఆ ఊరు వచ్చిన అచ్యుతం, అద్దె ఇంట్లో దిగాడు. అతను రోజూ కచ్చేరీకి వెళ్ళి వచ్చే దారిలో, చిన్న పెంకుటిల్లు ఉన్నది. ఆ ఇంటి అరుగు మీద యాభై ఏళ్ళావిడ కూర్చుని వుండేది. ఆమె రోజూ అభిమానంగా అచ్యుతం కేసి చూస్తూండేది.

ఒక రోజు సాయంత్రం ఆవిడ గుడి నుంచి వస్తూ, అచ్యుతానికి కనపడి, "నాయనా, యిది పటికబెల్లం, దేవుడి ప్రసాదం. కళ్ళకద్దుకుని తిను," అంటూ పటికబెల్లం ముక్క ఒకటి అచ్యుతం చేతిలో పెట్టింది.

అచ్యుతం పటికబెల్లం నోట్లో వేసుకున్నాడు. తరవాత ఇద్దరూ కబుర్లు చెప్పుకుంటూ నడక సాగించారు. ఆమె, అచ్యుతంతో, "నిన్ను చూస్తూంటే, మా తమ్ముణ్ణి చూస్తున్నట్టే వుంటుంది. వాడు పొరుగూళ్ళో కరణం. వాడంటే నాకు పంచప్రాణాలు. వాడికి మాత్రం నా నీడే గిట్టదు," అంటూ కళ్ళ నీళ్ళు పెట్టుకున్నది.

ఆమె తన గోడు చెప్పుకున్నది. ఆవిడ పేరు అచ్చాయమ్మ. భర్తపోయి ఐదేళ్ళు దాటింది. పిల్లలులేరు. ఒక్క తమ్ముడు మాత్రం వున్నాడు. భర్తపోయాక తమ్ముడి ఇంట గాడిద చాకిరీ చేసింది. అయితే, తమ్ముడి భార్య ఆమెను హీనంగా చూడటమే కాక, భర్తతో లేనిపోని చాడీలు చెప్పేది. అవి నమ్మి తమ్ముడు ఆమెను కొట్టవచ్చేవాడు. అన్నీ సహించి ఆమె అక్కడే పడి వుండేది. రెండేళ్ళ క్రితం తమ్ముడు ఇంట్లోంచి తరిమేస్తే, యీ ఊరు వచ్చి వుంటున్నది.

అచ్చాయమ్మ అచ్యుతానికి తనను గురించి అంతా చెప్పి, "నాయనా,

మాచిరాజు కామేశ్వరరావు

ఈ ఒంటరి బతుకు మీద రోత పుడు తున్నది. ఎన్ని చేసినా మా తమ్ముణ్ణి మరిచిపో లేకుండా వున్నాను. నువ్వయినా నాతో అప్పుడప్పుడూ యిక్కడికి వచ్చి మాట్లాడుతూవుంటే తృప్తిగా వుంటుంది." అంటూ కన్నీళ్ళు తుడుచుకున్నది.



అచ్యుతానికి ఆమె మీద జాలి పుట్టు కొచ్చి, "అలాగే వచ్చిపోతుంటాను, అక్కయ్యా!" అన్నాడు.

ఆ జవాబుకు ఆమె మురిసిపోయి, అప్పటికప్పుడు వంటచేసి, అచ్యుతం చేత కొసరికొసరి తినిపించింది. ఆ రోజు నుంచి అచ్యుతం తరచుగా ఆమె ఇంటికి వెళు తూండేవాడు. ఆమె కూడా అచ్యుతం ఇంటికి వచ్చి అతడు కచేరీకి వెళ్ళాక ఇల్లు సర్ది, బట్టలు ఉతికి, రాత్రి భోజనం సిద్ధంచేసి వుంచేది.

ఒకరోజు రాత్రి అచ్యుతం ఇంటి తలుపు ఎవరో దడదడ బాదారు. అచ్యుతం పోయి తలుపు తీసేసరికి, వాకిట్లో అచ్చా యమ్మ గడగడ వణికిపోతూ కనిపించింది.

"సంగతేమిటి? ఎందుకాభయం?" అంటూ అచ్యుతం లోపలికి దారితీశాడు.

అచ్చాయమ్మ లోపలికి వచ్చి, పెద్ద చెంబునిండు మంచినీళ్ళు తాగి, జరిగింది చెప్పింది: ఆమెకు నిద్ర పట్టబోతుండగా పెరట్లో ఏదో అలికిడి అయింది. ఆమె కిటికీలోంచి చూడగా, పెరట్లో మొక్కలు తింటూ గేదె ఒకటి కనిపించింది. ఆమె పెరటి తలుపు తెరిచి, గేదెను అదిలించి వచ్చి, తలుపు మూస్తుండగా, మెడను చల్లగా ఏదో తాకింది.

అచ్చాయమ్మ భయంకొద్దీ కేక వేయ బోయి, తల తిప్పేంతలో, గుప్పెట కత్తి పట్టిన నల్లటి వాడొకడు, "గోల చెయ్య కుండా మెడలో వున్న గొలుసూ, చేతి కున్న బంగారం గాజులూ యిచ్చెయ్యి. అరిచావో, పీక తెగిపోతుంది!" అన్నాడు కరుకుగా.

ఇంతలో అదృష్టవశాత్తూ, గస్తీ తిరుగు తున్న రక్షకభటుడు అటుగా వచ్చాడు.



దొంగ పళ్ళు కొరుకుతూ, ''ఇప్పటికి బతికిపోయావు! ఈ బంగారం వదులు తానను కున్నావా? చూస్తూండు,'' అని పారిపోయాడు.

భయంతో ప్రాణాలు కడబట్టగా, అచ్చాయమ్మ ఏం చేయాలో తోచక, ఆ రక్షకభటుడికి కాస్త వెనగ్గా నడుస్తూ, అచ్యుతం ఇంటికి వచ్చేసింది.

''ఈ నగలు మా అమ్మవి. మొగుడు చచ్చినదానికి నగలెందుకు, నా పెళ్ళాని కివ్వు, అంటూ వేధిస్తున్నాడు నా తమ్ముడు. నాకున్న ఆస్తి అంతా, యీ నగలే! ఈ నగలు యిప్పుడే యిచ్చేస్తే, చచ్చాక నా శవాన్ని దహనం చేసేవాళ్ళు కూడా వుండరు. ఇవి దొంగ ఎత్తుకు పోయాడంటే, నా తమ్ముడు నమ్మడు,'' అంటూ అచ్చాయమ్మ మెడలో గొలుసూ, చేతి గాజులూ తీసి అచ్యుతం చేతిలో పెట్టింది.

ఆ తరవాత వారం తిరక్కుండానే ఆమె, అచ్యుతంతో, ''దొంగభయంతో నాకు రాత్రిళ్ళు నిద్రే లేదు. కాపలా కాయలేని సొత్తును దగ్గిర వుంచుకోవటం మనిషికి నరకం. ఆ నగలు నా తమ్ముడి ముఖాన కొట్టివస్తాను,'' అన్నది.

అచ్యుతం ఆమెకు నగలు యిచ్చేద్దామని పెట్టెలో చూస్తే, నగలు లేవు. బట్టలన్నీ తీసి దులిపి చూసినా ప్రయోజనం లేకపోయింది.

నగలు కనిపించక పోయేసరికి అచ్చాయమ్మ గొల్లుమన్నది. ''ఆ దొంగ వెధవ అన్నంతపనీ చేశాడు. నువ్వు ఏమరు పాటుగా వున్నప్పుడు లోపలికి వచ్చి, నగలు ఎత్తుకుపోయి వుంటాడు. మూడు వేలు ఖరీదు చేసే నగలు! నేనెక్కడ తెచ్చేది? నా తమ్ముడికీ సంగతి తెలిస్తే, చంపేస్తాడు. వాడు ఆ పాపం కట్టుకోకముందే, ఏ నూతిలోనో దూకి చస్తాను,'' అంటూ తన ఇంటికి వెళ్ళిపోయింది.

అచ్యుతానికి ఏమీ పాలుపోలేదు. ఆ మూడు వేలూ పెట్టి అచ్చాయమ్మకి

అలాంటి నగలే చేయించాలి. కాని, తన దగ్గిర అంత డబ్బులేదు.

అచ్యుతం అప్పటికప్పుడే బయలుదేరి, అచ్చాయమ్మ తమ్ముడుండే గ్రామం చేరాడు. అక్కడ కరణంగారి ఇల్లు తెలుసుకుని, ఆయనతో జరిగినదంతా చెప్పి, "ఆ నగలు పోవటానికి నా అజాగ్రతే కారణం. మీరు ఆవిడను ఏమీ కోప్పడకండి. వాయిదాల మీద ఆ డబ్బు చెల్లిస్తాను," అన్నాడు ప్రాధేయపడుతూ.

కరణం అంతా విని ఫెళ్ళుమని నవ్వి, "మా అక్క బుద్ధి వయసు మీరుతున్న కొద్దీ పదునెక్కుతోంది. ఆమె సంగతి నీకే మాత్రం తెలిసినట్టు లేదు," అని అచ్చాయమ్మ గురించి చెప్పాడు.

అచ్చాయమ్మది చిన్నతనం నుంచీ దొంగబుద్ధి. భర్తపోయాక తమ్ముడి ఇంట వున్న రెండేళ్ళూ, నానా రచ్చ చేసింది. ఇంట్లో అవీ యివీ దొంగిలించేది. వాడకానికి తెచ్చిన సరుకులు రహస్యంగా అమ్ముకునేది. పిల్లలను చావబాదేది. భార్యాభర్తల మధ్య తంపులు పెట్టేది.

సొంత అక్కగదా అని చాలా కాలం సర్దుకుపోయాడతను. అయితే, ఆమె ఇరుగు పొరుగు యిళ్ళలో కూడా చిన్న చిన్న దొంగతనాలు ప్రారంభించే సరికి, ఇక పరువు పోతుందని, ఇంట్లోంచి పంపివేశాడు. ఆమె ఖర్చులకు నెలనెలా డబ్బు పంపిస్తున్నాడు.



"మా అక్క నా మీద దుష్ప్రచారం చేసి, ఎదటి వాళ్ళ జాలి సంపాదించి, వాళ్ళను మోసగిస్తున్నది. నువ్వు ఆవిడ మీద జాలిపడి, ఆ మూడు వేలూ ఇస్తావని ఆవిడ ఆశ. ఇంట్లో మనిషిగా వుంటున్నది గనక, ఆ నగలు పెట్టెలోంచి ఆవిడే తీసుకుని వుంటుంది. నిజానికి, మా అక్క దగ్గర బంగారు నగలంటూ లేవు; అవి గిల్టువై వుండాలి. నువ్విలా చెయ్యి," అంటూ అచ్చాయమ్మ తమ్ముడు, అచ్యుతానికి ఏం చెయ్యాలో రహస్యంగా చెప్పాడు.

అచ్యుతం ఇంటికి తిరిగి రాగానే, అచ్చాయమ్మ ఆత్రంగా, "నగలు దొరి కాయా ?" అని అడిగింది.

"నేను మీ తమ్ముడి ఊరు వెళ్ళొస్తు న్నాను. మీకింకేం భయం లేదు. నగల ఖరీదు ఐదువేలని మీ తమ్ముడు వాదిం చాడు. చేసేదిలేక ఐదువేలూ యిచ్చి వస్తున్నాను," అన్నాడు అచ్యుతం.

అచ్చాయమ్మ తెల్లబోయి, మారు మాటాడకుండా ఇంటికి వెళ్ళింది. ఆ మర్నాడు ఆమె చీకటితోనే బయలు దేరి తమ్ముడుండే ఊరుకు వెళ్ళి, వాకిట్లో ఆయన కనిపించగానే, "ఏరా, పాపిష్టి వెధవా! ఆ గిల్టు నగల ఖరీదు ఐదు వేలా ? నాకు రావలసిన డబ్బు, మధ్యలో నువ్వు గద్దలా తన్నుకుపోతావా ? ఆ ఐదు వేలూ వెంటనే కక్కు. నే నసలే మంచి దాన్ని కాదు," అన్నది కోపంగా.

"వస్తూనే, అక్షింతలు వేస్తున్నావా ? అవును, పెద్దదానివి గనక నీకు ఆ అర్హత వున్నది. కాని, ఒకటి: ఈ వయసులో డబ్బు కాపీనంతో మోసాలకు దిగావంటే, చచ్చి దయ్యానివవుతావు. హాయిగా దైవ చింతన చేస్తూ, మా ఇంట్లోనే వుండు," అన్నాడు అచ్చాయమ్మ తమ్ముడు.

ఆమె వెనకనే బండీలో వచ్చిన అచ్యుతం, ఆ మాటలన్నీ విని, అచ్చా యమ్మతో, "నిన్ను అక్కా అని పిలిచి నందుకు సిగ్గుపడుతున్నాను. నమ్మించి ఎంత మోసం చేశావు ?" అన్నాడు అసహ్యపడుతూ.

అచ్చాయమ్మకు తలకొట్టేసినట్టయింది.

అచ్చాయమ్మ తమ్ముడు కరణం, అచ్యుతంతో, "నువు కుర్రవాడివి, అయినా యీ అనుభవంతో కొంత లోక జ్ఞానం అలవరుచుకోవాలి. పటికబెల్లం, పటిక చూపులకు ఒకేలా వుంటాయి. ఏవేవో తెలుసుకోకుండా, నోట పెట్టు కుంటే, నోరంతా చేదవుతుంది. మను షుల్లో కూడా అలా పటిక లాంటి వాళ్ళూ, బెల్లం లాంటి వాళ్ళూ వుంటారు," అన్నాడు.



# జమీందారు - దున్నపోతు

పిల్లికి బిచ్చం పెట్టని జమీందారు ఇంటిముందు ఆకలితో నీరసించిన పేదయాచకుడు యాచించాడు. జమీందారు నౌకర్లతో ఆ యాచకుణ్ణి బయటికి గెంటించాడు. యాచకుడు కడుపు మంటతో, "మీ జమీందారు దున్నపోతా ఏం?" అని తిట్టాడు.

జమీందారు మండిపడి యాచకుడి మీద న్యాయస్థానంలో ఫిర్యాదు చేశాడు. న్యాయాధికారి యాచకుణ్ణి పిలిపించి, "జమీందారుగారిని దున్నపోతు అని తిట్టావా?" అని అడిగాడు.

నిజమేనని యాచకుడు ఒప్పుకున్నాడు.

న్యాయాధికారి యాచకుడికి పది రోజులు కారాగారశిక్ష విధించాడు.

యాచకుడు న్యాయాధికారిని, "అయ్యా, జమీందారుగారిని దున్నపోతు అనడం నేరమన్నారు. మరి దున్నపోతును జమీందారుగారూ అని పిలిస్తే, మీకేమన్నా అభ్యంతరమా?" అని అడిగాడు.

"ఏమీ అభ్యంతరం లేదు," అన్నాడు న్యాయాధికారి.

"అయితే, వెళ్ళివస్తాను, జమీందారుగారూ!" అన్నాడు యాచకుడు, రక్షకభటుల వెంట కారాగారానికి వెడుతూ—జమీందారుతో.

—కోనే నాగ వెంకట అంజనేయులు





# ఇద్దరు మోసగత్తెలు

హారూన్ అల్‌రషీద్ బగ్దాదులో ఖలీఫాగా వుండగా ఆయన రాజ్యమంతటా పావురాల టపా నడిచేది. దాన్ని నడిపినవాడు ఒక గొప్పవాడు. ఖలీఫా ఆయనను కొడుకులాగా చూచుకోవటమే గాక ఆయనకు నెలకు వెయ్యి దీనారాలు జీతం ఇచ్చాడు.

కాలక్రమాన ఆయన చనిపోయాడు. పావురాల టపా అంతమయింది. ఆయన టపా నిమిత్తం ఉంచుకున్న పావురాలనూ, నలభైమంది నీగ్రో బానిసలనూ, నలభై వేటకుక్కలనూ ఖలీఫా తెప్పించుకున్నాడు.

పావురాల టపా అధికారికి దిలైలా అనే భార్యా, జీనాబ్ అనే కూతురూ ఉండేవారు. తన భర్త స్థానంలో తాను పావురాల టపా సాగించగలననీ, తనకు ఆ ఉద్యోగం ఇచ్చి, పూర్వం భర్త కిచ్చిన జీతమే తనకూ ఇమ్మనీ దిలైలా ఖలీఫాకు అర్జీ పెట్టుకున్నది. కాని ఈ అర్జీ బుట్ట దాఖలయింది. దిలైలా శక్తిసామర్థ్యాలు ఖలీఫా ఎరగడు.

ఇది జరిగిన కొద్ది రోజులకే ఖలీఫా ఇద్దరు గజదొంగలను కొత్వాలు పదవికి నియమించాడు. వారిలో ఒకడి పేరు అహ్మద్, రెండోవాడి పేరు హసన్. ఇద్దరూ ఆరితేరిన దొంగలు. వారిని పట్టటానికి ఖలీఫా ఎన్నో యత్నాలు చేసి విఫలుడయాడు. దొంగతనంలో ఇంత నేర్పరితనం గల వీరిని కొత్వాళ్ళుగా నియమించటం మంచిదని ఖలీఫాకు తోచింది.

తన అర్జీని తోసివేసిన ఖలీఫా ఇద్దరు చోరులకు ఉన్నత పదవు లిచ్చాడని విని దిలైలా మండిపడింది. "ఈ దేశంలో దొంగలకూ, మోసగాళ్ళకూ గౌరవ మర్యాదలు లభించే పక్షంలో, మనమేనా

తక్కువ తిన్నవాళ్ళం? చూస్తూ వుండు, ఈ అహ్మద్, హసన్‌లు నా ముందు ఎందుకూ పనికిరారని రుజువు చేస్తాను,'' అన్నదామె తన కూతురు జీనాబ్‌తో.

నిజానికి దిలైలా వయసులో ముసలిదైనా యుక్తిలో చాలా గట్టిదే. ఆమె కూతురు జీనాబ్ కూడా తల్లికేమాత్రమూ తీసిపోయేదికాదు. తల్లి ప్రతిజ్ఞ విని ఆమె చాలా సంతోషించింది.

తన మోసాలతో బగ్దాద్‌ను మారుమోగించాలని దిలైలా పట్టుపట్టింది. ఆమె సూఫీ సన్యాసిని వేషం ధరించింది. ముఖానికి ముసుగు వేసుకున్నది, మెడ నిండా కట్టెడు తావళాలు వేసుకున్నది, చేతిలో సూఫీ బిచ్చగాళ్ళ జెండా పట్టుకుని ఆమె ఇంటి నుంచి బయలుదేరింది.

బగ్దాద్‌లో ఉండే గొప్పవారిలో ఒకడు ఖలీఫా రక్షకభట నాయకుడు, ముస్తఫా. ఆయనకు పెద్ద జీతం, బ్రహ్మాండమైన చక్కని ఇంటికి గంధపు చెక్కతో చేసిన తలుపులూ, వెండి తాళాలూ ఉండేవి. ఇన్ని ఐశ్వర్యాలకు తోడు ముస్తఫా భార్య చాలా చిన్నది, చక్కని చుక్క. ఆమె పేరు ఖాతూన్. ముస్తఫాకు భార్య అంటే ప్రాణం. అందుకనే, ఆమెవల్ల తనకు సంతానం కలగకపోయినా, ఆయన మరొక భార్యను చేసుకోలేదు. సాటి



అధికారులు దివాణానికి తమ కొడుకులను తెస్తుంటే చూసి ఆయన లోలోన కుమిలిపోయేవాడు.

ఖాతూన్ కూడా తనకు పిల్లలు కలగలేదని విచారించేది. తన భర్త పిల్లల కోసం వాచిపోతున్నాడని ఆమెకు తెలుసు. పిల్లలు కలిగేటందుకామె యెన్నో ప్రక్రియలు చేసింది, మందులు సేవించింది. ప్రయోజనం మాత్రం లేకపోయింది.

మారువేషంలో, ''అల్లా, అల్లా!'' అని కేకలు వేస్తూ వీధుల వెంట తిరుగుతున్న దిలైలా, ముస్తఫా ఇంటి సమీపానికి వచ్చి తల ఎత్తి చూసేసరికి మేడ మీది కిటికీలో ఖాతూన్ కనిపించింది.



ఆమె అంతులేని ఆభరణాలు ధరించి కొత్త పెళ్ళికూతురులాగా వెలిగిపోతున్నది. "ఈ పిల్లను తీసుకుపోయి ఆ నగలన్నీ కాజెయ్యకపోతే నా ప్రజ్ఞ ఏమిటి?" అనుకున్నది దిలైలా.

దిలైలాను చూడగానే ఖాతూన్‌కు కూడా ఆశ పుట్టుకొచ్చింది. ఈ సూఫీ సన్యాసిని అనుగ్రహం సంపాదిస్తే, తనకేమైనా సంతానం కలగవచ్చుననుకుని, ఆమెను పిలుచుకు రావటానికి ఖాతూన్ దాసీని పంపింది.

దిలైలా పైకి రాగానే ఖాతూన్ ఆమె పాదాలమీద పడి తన విచారాన్ని వెలిబుచ్చింది. అంతా విని దిలైలా, "ఇదొక పెద్ద సమస్యకాదు. ఈ నగరంలోనే సంతానసాధు వొకాయన ఉన్నాడు. ఆయనను ఒక్కసారి చూస్తివా, నీ కోరిక తీరే ఉపాయం చెబుతాడు," అన్నది.

ఖాతూన్ విచారంగా, "నే నెన్నడూ, పుణ్యాలకూ, పురుళ్ళకు కూడా ఇల్లు దాటి వెళ్ళినదాన్ని కాను," అన్నది.

"అయితే ఇప్పుడే నా వెంట వచ్చెయ్యి. నిన్నా సాధువు దగ్గిరికి తీసుకుపోతాను. నీ భర్త తిరిగివచ్చే లోగా నువు మళ్ళీ ఇంటికి చేరుకోవచ్చు," అన్నది దిలైలా.

తన కోరిక ఫలిస్తుందన్న ఆనందంతో ఖాతూన్ తనకు గల మిగిలిన నగలు కూడా ధరించి దిలైలా వెంట బయలుదేరింది. వారు కొంత దూరం వెళ్ళేసరికి సిద్దీ మొహసిన్ అనేవాడి దుకాణం వచ్చింది. ఈ దుకాణదారు యువకుడు. అతనికింకా పెళ్ళికాలేదు. అతన్ని చూడగానే దిలైలాకు ఒక ఆలోచన తట్టింది. ఆమె ఖాతూన్‌ను బయటి అరుగు మీద కూచోబెట్టి మొహసిన్ దుకాణంలోకి వెళ్ళింది.

"ఆ కనిపించే అందగత్తె నా కూతురు. దానికి పెళ్ళి యీడు వచ్చింది. నీ వంటి బుద్ధిమంతుణ్ణి చూసి పెళ్ళి చేద్దామని వుంది. దాని తండ్రి వర్తకం చేసి చాలా సంపాదించాడు గనక నీ కేమీ లోటు

వుండబోదు. బోలెడంత కట్నమిస్తాడు,'' అన్నది దిలైలా మొహసిన్‌తో.

మొహసిన్ పరమానంద భరితుడై, ''పెళ్లి ఎప్పుడు ఖరారు చేసుకుందాం?'' అని అడిగాడు. తన వెంట వస్తే ఇప్పుడే ఖరారు చేసుకోవచ్చునన్నది దిలైలా. మొహసిన్ ఒక వెయ్యి దీనారాల సంచి కట్టు చంకన పెట్టుకుని బయలుదేరాడు.

దిలైలా ఖాతూన్‌నూ, మొహసిన్‌నూ వెంటపెట్టుకుని దారిన పోతూండగా హజ్ ముహమ్మద్ అనే కలంకారీవాడి దుకాణం వచ్చింది. తన వెంట వున్న యిద్దరినీ దూరంగా నిలబెట్టి, దిలైలా లోపలికి వెళ్ళి, ''అయ్యా, ఆ కనిపించే యిద్దరూ నా కొడుకూ, కూతురూనూ. మా ఇల్లు మీద పడేటట్టుగా ఉంటే మరమ్మత్తు ప్రారంభించాం. మీ ఎరికను ఖాళీ ఇల్లేమయినా ఉన్నాయా? నాలుగు రోజులు మేం ఉండదలిచాం.'' అని కలంకారీతో అన్నది.

అతను ఆలోచించి, ''మా యింటి పై భాగం ఖాళీగానే వుంది. కింద నేనుంటున్నాను. తరుణంలో నీలిమందు అమ్మవచ్చే వారుండటానికి మేడమీది భాగం ఖాళీగా ఉంచాను. నాలుగు రోజులు మీకు కావలిస్తే వాడుకోండి. ఇవిగో తాళపు చెవులు,'' అన్నాడు.



దిలైలా మిగిలిన వాళ్ళను వెంటబెట్టుకుని హజ్ ముహమ్మద్ ఇంటికి వెళ్ళి కిందిభాగం తెరిచి లోపలికి వెళ్ళమని మొహసిన్‌కు సైగ చేసింది. తరవాత ఆమె ఖాతూన్‌తో సహా పైకి వెళ్ళి, ''అమ్మాయీ, నేను చెప్పిన సాధువు ఈ మేడ కింది భాగంలోనే ఉంటాడు. నేను వెళ్ళి, ఆయనతో నీ విషయం చెప్పి ఇప్పుడే వస్తాను. ఈ లోపల నువు నీ నగలన్నీ తీసి భద్రంగా మూటగట్టి ఆ సాధు దర్శనం చేసుకోవటానికి సిద్ధంగా వుండు. ఆయన దగ్గిరకి నగలతో వెళ్ళటం మహాపరాధం!'' అని కిందికి వెళ్ళిపోయింది.

మొహసిన్ ఆమెతో, "ఏమిటి, పెళ్ళి ఖరారు అనుకుందామా?" అన్నాడు.

దిలైలా వగల ఏడుపులు ఏడుస్తూ, "నేనేం చేసేది నాయనా? ఓర్చలేని దుర్మార్గులు పిల్ల మనసు కాస్తా విరిచే శారు. నీకు తామర వున్నదనీ, బొల్లి వున్నదనీ దానితో చాడీలు చెప్పారు. అది ససేమిరా నిన్ను పెళ్ళాడనంటున్నది. నీ చొక్కా విప్పదీసి కూచో. దాన్ని తీసుకు వచ్చి చూపించి పెళ్ళికి ఒప్పి స్తాను. నీ సంచీ, చొక్కా నా కిచ్చెయ్యి, పైన భద్రంగా దాస్తాను," అన్నది.

మొహసిన్ తన దీనారాల సంచీ, చొక్కా ఆమె చేతికిచ్చాడు. ఆమె మళ్ళీ పైకి వెళ్ళి ఖాతూన్‌తో, "నీ కోసం సాధువు యెదురు చూస్తున్నాడు. నీ పంట పండిందిలే. కిందికి పద. నీ నగలమూట దాచి ఇప్పుడే వస్తున్నాను," అన్నది.

ఖాతూన్ కిందికి దిగి లోపలికి వెళ్లింది. దిలైలా ఆమె వెనకే రెండు మూటలూ పట్టుకుని వీధిలోకి వెళ్ళిపోయింది.

ఖాతూన్ కింది అంతస్థులోకి వెళ్ళి చూసింది. ఆమెకు సాధువు ఎక్కడా కనిపించలేదు గాని చొక్కా లేకుండా మొహసిన్ కనిపించి, "చూసుకో, నా వంటిమీద ఒక మచ్చ అయినా ఉన్న దేమో!" అన్నాడు. ఖాతూన్ బెదిరి పోయి మళ్ళీ మేడమీదికి పరిగెత్తి తలుపు మూసి గడియ వేసుకున్నది.

సూఫీసన్యాసిని జాడ గాని, తన నగల మూట జాడ కాని ఆమెకు కనిపించలేదు.

ఈలోగా దిలైలా తాను కాజేసిన మూట లను ఒక ఎరిగున్న దుకాణంలో వుంచి కలంకారీ దుకాణానికి వెళ్ళింది.

"బాబూ, ఇల్లు చాలా సౌఖ్యంగా అమరింది. పిల్లలిద్దరూ ఆకలి అంటు న్నారు. కాస్త వాళ్ళకేమైనా పట్టుకు పోతారా? ఇదుగో, ఒక దీనారం పుచ్చు కోండి. మీరు కూడా వాళ్ళకు తోడుగా ఫలహారం చెయ్యండి. నే నింటికి పోయి సామాను పట్టించుకొస్తాను," అన్నది దిలైలా.

—(ఇంకా వుంది)





# విఘ్నేశ్వరుడు

సత్యలోకంలో కమలాసనం మీద కూర్చుని, పగలంతా సృష్టి చేసి, చేసి అలసిన బ్రహ్మకు, కల్పాంతం సమీపించటంతో నిద్రమత్తు ఆవరించింది. ఆ నిద్రమత్తులో ఆయన ఆవులించినప్పుడల్లా పర్వతశిఖరాగ్రాలు చిట్లి, అగ్నులను వెదజల్లాయి. నిద్రపట్టే సమయాన కళ్ళు చెమ్మగిల్లగా, ఆకాశంలో గుంపులు, గుంపులుగా కూడిన ప్రళయమేఘాలు మెరుపులతో, భయంకరంగా గర్జిస్తూ, ఏనుగు తొండాల వంటి ధారలతో వర్షించి, లోకాన్ని జలమయం చేశాయి. ఆయన కనురెప్పలు బరువుగా వాలడం ప్రారంభించే సరికి అన్ని దిక్కులా గాఢాంధకారం అలుముకున్నది.

ఈ ప్రళయ పరిస్థితిలో బ్రహ్మ నిద్రించాడు, ఆయనకు ప్రళయమనేది రాత్రి కాలం. తిరిగి నూతన కల్పారంభం కానున్న సమయం ఆసన్నమైంది. సరికొత్త జగత్తు మీద వెలుగు ప్రసరించబోతున్న తరుణంలో సరస్వతీదేవి వీణ సవరించి భూపాలరాగ స్వరాలను మెల్లగా పలికిస్తూండగా బ్రహ్మకు మెలకువ వచ్చింది.

ఆయన పద్మాసనం వేసి కూర్చుని, నాలుగు ముఖాలతో, నాలుగు దిక్కులూ కలయచూశాడు.

కిందవున్న జగత్తు అంతా నీటిమయమై మహా పర్వతాల్లాంటి కెరటాలతో కల్లోలంగా ఉంది. ఆ తరంగాల మధ్య ఒక

## 1. వటపత్ర బాలగణపతి



చోట కళ్ళను మిరుమిట్లుకొల్పే తెల్లని కాంతిరేఖ కనిపించింది.

ఆ కాంతిలో తరంగాలపై తేలుతూ ఒక పెద్ద మర్రిఆకు, దానిపై చందమామ లాంటి పసివాడు పడుకొని కుడి కాలి బొటనవేలు చప్పరిస్తూ కనిపించాడు.

బ్రహ్మ చేతులు జోడించి, కన్నులు మూసి ధ్యానించి తెరిచినంతలో ఒక వింత దృశ్యం కనిపించింది.

ఆ పసివాడు విశ్వవిరాట్ స్వరూపుడైన పరబ్రహ్మమేనని బ్రహ్మకు అనుభవ పూర్వకంగా తెలిసిన విషయమే. కాని ఇప్పుడా పిల్లవాని తల ఏనుగు తలను పోలి, చిన్నారి తొండంతో కుడిపాదాన్ని పట్టి నోటిలో పెట్టుతూన్నట్టుగా కనిపించింది.

ఆ ముఖం చాలా ప్రసన్నంగా ఉంది. పిల్లవాడు చంద్రకాంతితో ప్రకాశిస్తున్నాడు. నాలుగు చేతులు కలిగిఉన్నాడు. బ్రహ్మ ఆశ్చర్యంగా చూస్తున్న మరు నిముషంలో, ఆకుతో సహా ఆ పిల్లవాడు అదృశ్యమయ్యాడు. బ్రహ్మకు ఆ ప్రదేశాన ఎత్తుగా లేచిన పెద్ద మట్టిదిబ్బ ఒకటి కనిపించింది.

క్రమక్రమంగా నీటి నుండి సువిశాలమైన భూభాగాలూ, సముద్ర భాగాలూ ఏర్పడ్డాయి.

బ్రహ్మ సృష్టికి పూనుకున్నాడు. మొదట పర్వతాలు, నదులు ఏర్పడాలని సంకల్పించి కమండలం లోంచి నీరు తీసి జగత్తుమీద చల్లాడు. తరవాత వృక్షాలనూ, సస్యాలనూ, ఖనిజాలనూ సంకల్పించాడు. పిమ్మట కదులాడే జీవరాశిని—మొదట సముద్రంలో చేపలనూ, భూమ్మీద జంతుజాలాన్నీ, క్రిమికీటకాదుల్నీ, పక్షుల్నీ సృజించాడు. తరవాత మనుష్యులను సంకల్పించి కమండలోదకాన్ని చిలికాడు.

బ్రహ్మ సృష్టి చేస్తున్నంతసేపూ సరస్వతీదేవి వీణ వాయిస్తూనే ఉన్నది. ఎందువలనో అనుకోని విధంగా వీణ

అపశ్రుతి పలికింది. సరస్వతి నివ్వెర పడుతూ కిందకు చూసి మరింత నివ్వెర పడింది. బ్రహ్మ అర్ధాంగి నివ్వెరపాటు అర్థంగాక కమలాసనం నుంచి వంగి కిందికి చూశాడు.

పర్వతాలు బోర్లపడుతూ శిఖరాలు భూమిలోకి పాతుకుని వెడల్పుగా పర్వత పాదాలు సూర్యరశ్మి పడకుండా గొడుగుల్లాగా ఎదుగుతూన్నవి.

నదులు సాగరం నుంచి ఎత్తుప్రదేశాలకు చేరుకోబోతున్నవి. వృక్షాలు తలకిందులుగా, వ్రేళ్ళు ఆకాశానికి తన్నుతున్నవి.

సముద్రతరంగాల మీద జలచరాలు తేలుతూ కుప్పిగంతులు వేస్తున్నవి. కొన్ని నిటారుగా పయనిస్తున్నవి. కొన్ని పక్షుల్లా ఎగురుతున్నవి.

జంతువులూ చాలా అనర్థాలతో పుట్టాయి; తలలు లేకుండా కొన్ని, వెనుక కాళ్ళు లేకుండా కొన్ని, ఒంటికాలివి, మూడుకాళ్ళవీ, కళ్ళూ, చెవులూ అన్నీ వుండి నోరు అనేది లేనివీ, తోకలకు తలలున్నవీ, తలకు తోకలున్నవీ కనిపించాయి. పక్షులకు రెక్కలులేవు. అవి నడవాలంటే కాళ్ళులేక నేల మీద దొర్లుకుంటున్నవి.

ఈ వక్రతలన్నీ గమనించి బ్రహ్మ ఎంతగానో కలవరపడుతూ తన ఉత్తమోత్తమ మనుష్య సృష్టి ఎలాగుందోనని ఆత్రంగా చూశాడు.





మనుషులలో కొందరికి రెండు తల లున్నాయి. అందులో ఒకటి స్త్రీది, రెండోది పురుషుడిది.

పురుషులు జానెడు, బెత్తెడుగా ఉన్నారు. స్త్రీలు పెద్ద ఏనుగుల్లాగా, తాటి చెట్లలాగ ఉన్నారు. వీపులకు తలలు అతికించినట్టున్నవాళ్లు, నాలుగు, మూడు, ఒంటికాళ్ళ వాళ్ళూ, పొట్టకే పెద్దనోళ్ళున్న కబంధులూ ఆక్రందనాలు చేస్తూ కని పించారు.

జంతువులు మోరలు పైకెత్తి దీనంగా అరుస్తున్నవి. మూగగా చూస్తున్నవి. బ్రహ్మను నిందిస్తూన్నట్లుగా గింజు కుంటున్నవి, కదను తొక్కుతున్నవి.

ఒక జానెడు మగవాడు తాటిచెట్టంత వికృతాకారిణి అయిన స్త్రీని చూపిస్తూ, "ఓ బ్రహ్మదేవుడా! ఇలాంటి స్త్రీతో నే నెలా సంసార సాగరం యీదేది?" అంటూ ఆకాశానికి తలపెట్టి పెద్దగా అరుస్తున్నాడు.

"నాలుగు తలలంటూ ఉన్నా, అసలు తల అంటూ లేని ఓయి బ్రహ్మదేవుడా! మమ్మల్నెందుకిలాగ పుట్టించావు?" అంటూ వికృతాకారాల మనుషులు చేస్తూన్న ఆక్రందనాలు మిన్నుముట్టు తున్నవి.

బ్రహ్మ నాలుగు తలలూ గిర్రున తిరిగి పోయాయి. ఎనిమిది కళ్ళూ బైర్లు కమ్మాయి. తెల్లబోతూ బ్రహ్మ సరస్వతి వంక అయోమయంగా చూశాడు. అతని నాలుగు తెల్లమొహాలనూ చూసి సరస్వతి సరసంగా చిరునవ్వుతో సరిపెట్టి ఊరు కొన్నది.

"ఎందుకిలా జరిగింది? సక్రమమైన సృష్టి జరపాలనే సత్సంకల్పంతోనే కదా నేను సృష్టికి పూనుకున్నాను; ఇలాగ ఎందుకు జరిగింది?" అని తనలోతాను అనుకుంటున్నట్టుగా గట్టిగా తలలుపైకెత్తి అరిచాడు బ్రహ్మ. అతని ప్రశ్న దశ దిశలా మారుమ్రోగింది. అయోమయంగా వెర్రిచూపులు చూస్తున్న బ్రహ్మకు పెద్ద

వెలుగు కనిపించింది. ఆ వెలుగులో ఒక అద్భుతమూర్తి కనిపించాడు. ఆ మూర్తికి ఏనుగు తల ఉన్నది. నాలుగు చేతులలో పాశము, అంకుశము, కలశము, పరశువు ధరించి ఉన్నాడు. పూర్ణచంద్రుడివలె ప్రకాశిస్తున్నాడు. తెల్లని అతని ఉత్తరీయము ఆకాశమంతటా రెపరెపలాడుతూ ఎగురుతున్నది. అప్పుడు సరస్వతి వీణ ఓంకారనాదం చేసింది. సరస్వతీదేవి వేళ్ళు వాటంతట అవే వీణపై నాదనామ క్రియా రాగాన్ని పలికిస్తూ, మాయామాళవ గౌళరాగానికి మారుతూ, హంసధ్వని రాగాన్ని అందుకొన్నవి. గజాననుడై సాక్షాత్కరించిన ఆ దివ్యమూర్తి వట పత్రంపై నిలుచుని బ్రహ్మను అభయ ముద్రతో ఆశీర్వదించాడు. అతని చుట్టూరా శరత్కాల పూర్ణిమనాటి వెన్నెల వంటి వెలుగు ఆవరించి ఉన్నది.



బ్రహ్మ అప్రయత్నంగా చేతులు జోడించి నమస్కరిస్తూ, "మహానుభావా! అద్భుత మూర్తివైన నీ వెవ్వడవు? నీవెవరో తెలుసుకోలేని అజ్ఞానిని, అనుగ్రహించు!" అని అడిగాడు.

"నాయనా! బ్రహ్మదేవా! సంకల్పం వెనుకనే వికల్పం వెంటాడుతూంటుంది; అదే విఘ్నం! విఘ్నాన్ని అరికట్టి సంకల్పాన్ని నెరవేర్చే నేను విఘ్నేశ్వరుడను! విఘ్నాలకు నాయకత్వం వహించే వికల్పాన్ని నా గొడ్డలితో ఛేదించి ప్రతి కార్యాన్నీ నిండుకలశం లాగ జయప్రదం చేసే విఘ్నవినాయకుడిని. పంచభూతములనబడే పృథ్వి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశములనే భూతగణానికి అధిపతినైన గణపతిని. ఆహార ధాన్యాల్ని ఫలించే సస్యాల్ని నాశనం చేసే మదించిన ఏనుగుల వంటి విఘ్నాలను నా వాడిగల అంకుశంతో అదుపులో పెడుతూ వాటిని నా పాశము అనే బలమైన త్రాటితో కట్టి ఉంచే నన్ను, విఘ్నేశ్వరుడు అని పిలువు!" అని గంభీర స్వరంతో విఘ్నేశ్వరుడు పలికాడు.



అప్పుడు బ్రహ్మ, "దెవా! విఘ్నేశ్వరా! నా సృజనశక్తికి ఎందుకిలాగ ఘోరమైన విఘ్నం జరిగింది? ఇన్ని వంకరలెందుకు ఏర్పడ్డాయి? ఉత్తమంగా సృష్టిజరిగే మార్గం వివరంగా చెప్పు!" అన్నాడు.

"విఘ్నం గురించి నీకు తెలియాలనే ఇదంతా జరిగింది. మర్రిఆకుపై బాల గణపతిగా కనిపించిన వటపత్రగణపతినే నేను. అప్పుడు నా గురించి ఆలోచించ లేకపోయావు; నా గురించి ఆలోచించడ మంటే విఘ్నం గురించి ముందు జాగ్రత్త పడే జ్ఞానాన్ని కలిగిఉండటమే! ఆ జ్ఞాన స్వరూపుణ్ణే నేను! బ్రహ్మ మొదలు కొని బుద్ధిగల ప్రతి జీవీ కార్యరంగానికి దిగే ముందు విఘ్నం రాకుండా జయప్రదం కావడానికి తగు జాగ్రత్తనూ, జ్ఞానాన్నీ కలిగి ఉండక తప్పదు! ఏనుగు అడుగు వేసే ముందు నేల గట్టితనాన్ని తెలుసు కొని మరీ నడుస్తుంది; ప్రాణుల్లో ఏనుగు బుద్ధిబలం దాని లాగే చాలా పెద్దది. ఏనుగంత విశేష మేధస్సును కలిగి ఉండాలనే సూచనగా నేను గజాననుడిగా ఉన్నాను. నీవు నిద్రిస్తూన్న సమయంలో రాక్షసుడైన సోమకాసురుడు నీ నాలుగు వేదాల్ని అపహరించి సముద్రం అడుగున దాచాడు; మహావిష్ణువు మత్స్యావతారం దాల్చి వాణ్ణి సంహరించి నీ వేదాల్ని భద్రంచా తెచ్చి వటపత్రశాయినై ఉన్న నా దగ్గర ఉంచాడు. ఇవిగో! వాటిని తిరుగ గ్రహించి సృష్టి నిర్వర్తించు!" అని చెప్పి, విఘ్నేశ్వరుడు బ్రహ్మకు వేదాలను ఇచ్చాడు.

బ్రహ్మ వాటిని అందుకొని పరమా నందంతో విఘ్నేశ్వరుణ్ణి స్తుతించుతూ, "విఘ్నేశ్వరా! నేను సృష్టి సంకల్పించే ముందు నిన్ను ధ్యానించి, మనసారా నిన్ను పూజించి మరీ కార్యరంగానికి ఉపక్రమించే వరం అనుగ్రహించు! అవకతవకలుగా తయారైన సృష్టి ఉపసంహరించుకొనేలాగ చెయ్యి!" అని కోరాడు.

విఘ్నేశ్వరుడి ప్రభావం వల్ల అంత వరకు జరిగిన వంకర టింకరల సృష్టి అంతా క్షణంలో మటుమాయమైంది. అప్పుడు విఘ్నేశ్వరుడు మళ్ళీ బ్రహ్మతో, "ఓ బ్రహ్మదేవుడా! వక్రతను తుండ తుండములుగా ముక్కలు చేసే వాడిని గనుక నేను వక్రతుండుడు అనే పేరుకు సార్థకంగా నా తొండాన్ని వక్రంగా ఉంచు తూంటాను. వక్రతుండుణ్ణి అయిన నన్ను ధ్యానించి తలపెట్టిన ఏ పని కూడా వంకర పోదు! నీవు కోరుకున్నట్లే నన్ను ధ్యానించి సృజించు. సృజించటం ఒక కళ! ఆ కళ ఎటువంటి వంకరటింకరలు పోకుండా జగత్తు నీవు మలచిన కళా నిలయంగా భాసిస్తుంది! నీకు మల్లే జగత్తులో అందరికీ అందుబాటుగా తొలి పూజలందుకొనే విఘ్నేశ్వరుడిగా విఘ్నాల నుండి కాపాడుతూ, సంకల్పసిద్ధిని కలిగించే సిద్ధివినాయకుడుగా, సకల గణాలకూ అధిపతిగా గణపతినై శివ పార్వతులకు కొడుకుగా అవతరిస్తాను!" అని చెప్పి, బ్రహ్మను దీవించి అంతర్ధాన మయ్యాడు.

సరస్వతీదేవి బ్రహ్మ కేసి చిరునవ్వు నవ్వి హిందోళ, శ్రీరాగాలతో మంగళ స్వరాల్ని మహాకాశం పులకరించేట్లుగా వీణపై వినిపించింది.

బ్రహ్మ, "విఘ్నేశ్వరాయనమః!" అంటూ సృష్టిని ప్రారంభించాడు. సృష్టి మరింత అందంగా నిర్విఘ్నంగా సాగింది. గంభీరమైన పర్వత పంక్తులూ, అమృతజలాలతో నదులూ, సుందర వనాలూ, రంగు, రంగుల బొమ్మల్లాంటి జంతుజాలమూ, శారీరకంగానూ, మాన సికంగానూ ఉన్నతులూ, బలవంతులూ అయిన మనుషులతో జగత్తు బ్రహ్మచేసిన కళానిలయంగా విలసిల్లింది. వాగ్దేవి అయిన సరస్వతి తన వాణిని సంగీతంలా ప్రాణికోటికి స్వరపరిచింది. జీవకోటి సలక్షణంగా పెరిగింది.

ఊడలు చిమ్మే వటవృక్షంలాగ జగత్తు వర్ధిల్లింది.





# రాతిలోని ముఖం

అనేక వందల ఏళ్ళక్రితం ఆరావళీ పర్వత ప్రాంతంలో ఒక కొండ మీద రాతిలో, ఎవరో మహాశిల్పి మలిచినట్టుగా, ఒక మనిషి ముఖం యొక్క ఆకృతి ఉండేది. నిజానికి అది ఏ శిల్పీ మలిచినది కాదు. ఆ ముఖాకృతి ప్రకృతిసిద్ధంగానే ఏర్పడింది. ఆ చుట్టుపక్కల అనేక గ్రామాల వారికి రోజూ ఆ ముఖం కనిపిస్తూ వుండేది. వారు అందులో ఔదార్యమూ, కరుణా, శాంతమూ, దయా మొదలైన ఉన్నత భావాలు చూడగలిగేవారు. ఆ ముఖం యొక్క ఫాలభాగం విశాలంగా వుండి, జ్ఞానాన్ని సూచించేది.

ఈ రాతిలోని ముఖాన్ని గురించి అనేక రకాల కథలను ప్రజలు చెప్పుకొనేవారు. అదే పోలికగల మహనీయు డొకడు వెనక ఎప్పుడో వుండేవాడనీ, అతని దయవల్ల ప్రజలు ఎంతో సుఖపడ్డారనీ కొందరు చెప్పుకొనే వారు. కొంతకాలం క్రితం ఆ ప్రాంతాలకు ఒక మునీశ్వరుడు వచ్చాడు. చుట్టుపక్కల గ్రామాలవారు వందలాదిగా మునీశ్వరుణ్ణిచూడబోయారు. వారిలో కొందరు ఆ రాతిలోని ముఖం గురించి మునీశ్వరుణ్ణి అడిగారు. ఆ మునీశ్వరుడు కొంచెం సేపు ఆ ముఖం కేసి చూసి, "అదే పోలిక గలవాడు ఈ ప్రాంతాల కనిపిస్తాడు. అతను గొప్ప జ్ఞాని, మహనీయుడు. అతని వల్ల ప్రజలకు అంతులేని ఉపకారాలు జరుగుతవి," అన్నాడు.

ఈ విధంగా అనేక దశాబ్దాలు గడిచిపోయినయి. మునీశ్వరుడు చెప్పిన వృత్తాంతాన్ని ఒక తరంవారు మరొకతరం వారికి కటుకథ కింద చెప్పుకొంటూ వచ్చారు. చాలా మందికి ఆ కథలో విశ్వాసం కూడా పోయింది.



వడబోసిన వాడనీ, తర్క వ్యాకరణాది శాస్త్రాలలో ఘటికుడనీ అన్నారు.

ఈ సన్యాసి ముఖం రాతిలోని బొమ్మకు పోలికే లేదు. అయినా నిరాశ చెంద కుండా వసువు ఆయన చెప్పే గొప్పగొప్ప విషయాలన్నీ విన్నాడు. సన్యాసి చెప్పిన విషయాలు గొప్పవనటానికి సందేహం లేదు. కాని ఆయనకు ప్రజల జీవితమూ, వారి కష్టసుఖాలూ కొంచెమయినా తెలి యవు. సామాన్య కుటుంబంలో పుట్టి ప్రజ లతో నిత్యమూ కలిసి మెలిగే వసువుకు త్వరలోనే ఈ విషయం అర్థమయింది.

అదీకాక యీ సన్యాసి అమిత కోపిష్ఠి. తాను ప్రబోధించేటప్పుడు ఎవరూ తుమ్మ రాదు, దగ్గరాదు. అంత గొప్ప విషయాలు వినేటప్పుడు పామరులకు ఏదైనా ధర్మ సందేహం కలగదా ? సందేహం కలిగి ప్రశ్న వెయ్యరాదు! "మీ కర్మ! యోగ్యత గలవారు అర్థం చేసుకోండి. లేనివారు నోరుమూసుకోండి." అనే వాడు.

అంతకంతకూ ప్రజలకు సన్యాసి మీద భక్తి తగ్గింది. కొంత కాలానికి సన్యాసి వెళ్ళిపోయాడు. తన ఆశ ఫలించనందుకు వసువు నిట్టూర్చాడు.

కొంతకాలం జరిగింది. ఆ ప్రాంతాలకు మహా శౌర్యపరాక్రమ విక్రముడొకాయన వేంచేశాడు. ఆయన అనేక యుద్ధాలలో

కాని విశ్వాసం పోనివారిలో ఒక కుర్ర వాడుండే వాడు. వాడి పేరు వసువు. వసువు పసివాడై ఉన్నప్పుడే వాడి తాత వాణ్ణి రోజూ ఒళ్ళో కూచోబెట్టుకుని రాతి లోని బొమ్మ చూపిస్తూ మునీశ్వరుడు తన చిన్నతనంలో చెప్పిన మాటలను తన మనవడికి చెప్పేవాడు. అనేక సంవత్స రాల పాటు రోజూ ఈ విషయం విని వుండటం వల్ల మునీశ్వరుడు చెప్పిన జోస్యం వసువు తలకు బాగా పట్టింది.

ఇట్లా ఉంటూ వుండగా, వసువు వుండే గ్రామానికి ఒక రోజున మహా జ్ఞాని అయిన సన్యాసి ఒకడు వచ్చాడు. ఆయన వేదాలనూ, ఉపనిషత్తులనూ బాగా కాచి

గెలిచిన వీరుడు. ఆయన ఉన్నచోట శత్రు భయం ఉండదనీ, ప్రజలు నిశ్చింతగా గుండెలమీద చేయి వేసుకు నిద్రపోవచ్చుననీ అన్నారు. మునీశ్వరుడు చెప్పిన మనిషి ఈ యోధుడే అయి వుంటాడని వసువు ఆశపడి వెళ్ళి చూశాడు. కాని ఈ వీరుడి ముఖం రాతి లోని ముఖాన్ని బొత్తిగా పోలి వుండలేదు.

పైగా ఈ వీరాగ్రేసరుడు ప్రజల కష్ట సుఖాలు ఎరిగినవాడు కాడు. తమతమ పనులలో నిమగ్నులై వుండే మనుష్యులను వేళకాని వేళ పిలిపించి వారి పనులు పాడుచేసేవాడు. తన మాట వినని వారిని హింసించే వాడు. క్రమంగా ప్రజలకు ఆయన మీద గౌరవం పోయింది. ఆయనా మరొక ప్రాంతానికి వెళ్ళిపోయాడు వసువు మరొకసారి నిట్టూర్చాడు.

మరికొంత కాలం గడిచింది. ఆ ప్రాంతాలకు గొప్ప వణిగ్పుంగవుడు వస్తున్నట్టు తెలిసింది. ఈయన సముద్రాల మీద నావలను పంపి పెద్ద యెత్తున వ్యాపారం చేసి కోట్లు గడించాడట. ఆయన రెండురోజులు నిలిచిన చోట భోగభాగ్యాలూ, సిరిసంపదలూ తాండవిస్తాయట.

ఇక్కడి వారంతా కష్టజీవులనీ, తమ గ్రామాలలో సిరిసంపదలు తక్కువనీ



వసువు ఎరుగును. ఈ వర్తకుడు తమను ఉద్ధరించటానికి వస్తున్నాడనీ, ఈయన ముఖం రాతిలోని ముఖాన్ని పోలి వుంటుందనీ వసువు చాలా ఆశపడ్డాడు.

కాని తీరా చూస్తే వర్తకుడి ముఖం మరొక విధంగా వుంది. అయినా ఈయన రాకవల్ల సిరిసంపదలు పెరిగేటట్టే కనిపించాయి. ఆయన పోలాలలో కొత్త పంటలు వేయించాడు, ఆ పంటలు తానే కొన్నాడు. రైతులకు పాత పంటలకన్న ఈ కొత్త పంటలు ఎక్కువ లాభించాయి. అందరి దగ్గిరా ఎక్కువ డబ్బు మెసల సాగింది. వృత్తుల వారిలో కూడా పూర్వం ఎరగని వృత్తులను కోటీశ్వరుడు ప్రోత్స



హించాడు. ఒకటి రెండేళ్ళయిన తరువాత కోటీశ్వరుడు కొత్త పంటల ధరలు తగ్గించాడు. కొత్త వస్తువుల ధరలు కూడా తగ్గించాడు. ఆ పంటలూ, ఆ వస్తువులూ తమకు పనికొచ్చేవి కావు గనక కోటీశ్వరుడు నిర్ణయించిన ధరకు ప్రజలు ఒప్పుకోవలిసి వచ్చింది. లేకపోతే కొనేవారే లేరు!

అదీగాక ప్రజలుతినే ఆహారపదార్థాలూ, నిత్యమూ వాడుకునే వస్తువులూ కరువు కాసాగినై. వాటి ధరలు పెరగసాగాయి. ప్రజల జీవితంలో సంక్షోభం బయలుదేరింది. అదివరకు హాయిగా జీవిస్తున్నవారు కొందరు నిరుపేదలై పోయారు. తిండికాటకమూ, డబ్బుకాటకమూ కూడా వచ్చిపడింది. కోటీశ్వరుడు తనకు కావలసిన సరుకంతా సంచులు నింపుకొని, సంచులు బండ్లలో పేర్చుకొని, వచ్చిన దారినే వేంచేశాడు. వసువుకు ప్రజలను చూసి దుఃఖం వచ్చేసింది. వాడి వయసుతో బాటు బుద్ధి కూడా వికసిస్తున్నది.

మరికొంతకాలం గడిచింది. ఆ ప్రాంతాలకు ఒక మహాకవి వచ్చాడు. ఆ కవి సామాన్య ప్రజలజీవితం తెలిసినవాడు. సామాన్య ప్రజలను గురించి గీతాలు రాశాడు. ఆయన గీతాలకు దేశదేశాలా ఖ్యాతి లభించింది.

''ఈ కవి ముఖం తప్పక రాతిలోని ముఖాన్ని పోలివుంటుంది. మహాముని వాక్కు వ్యర్థం కాదు,'' అనుకున్నాడు వసువు.

కవి వచ్చాడు. ఆయన ముఖంలో రాతిలోని ముఖం కవళిక లేమీ లేవు. కవి పాటలు పాడాడు. జనం ఆయన చుట్టూ మూగి ఆయన గీతాలు విని తన్మయులైనారు. ఆయన్ను దేవుడికన్న ఎక్కువగా చూశారు. ఆయనకు సకలోపచారాలూ చేశారు. కాని కవికి ప్రజలపట్ల నిజమైన ఔదార్యం లేదు. వారిమీద ఆయనకు నిజమైన సానుభూతి లేదు.

ఆయన తన గీతాలలో ప్రజల కృషిని పొగిడాడే గాని ఆ కృషి చూస్తే ఆయనకు

గౌరవం లేదు. పనీ పాటలూ చెయ్యని వారితోనూ, డబ్బు ఎక్కువ కలవారి తోనూ ఆయన అన్యోన్యంగా ఉండేవాడు.

"ఈ కవి వంచకుడు. ఆయన తన గీతాలతో ప్రజలను వంచిస్తున్నాడు గాని ప్రవర్తనతో కాదు. అందుచేత ఆయన ప్రవర్తన వాస్తవమైనది, ఆయన గీతాలు అసత్యమైనవి—వాటిలో ఎంత యదార్థం ఉంటేనేం?" అనుకున్నాడు వసువు.

ప్రజలు కవినైజం తెలుసుకుని ఆయన పట్ల ఆదరం చూపడం మానివేశారు. కవి కొంతకాలం వుండి ఎటో వెళ్ళిపోయాడు.

వసువు విచారంగా రాతిలోని బొమ్మ కేసి చూస్తూ నిలబడ్డాడు. తన తాత చెప్పిన మునీశ్వరుడి మాటలయందు విశ్వాసం చలించసాగింది.

ఎంద రెందరో మహనీయులు తాను చూస్తుండగా వచ్చారు. ఒక్కరి ముఖం లోనూ ఆ బొమ్మలో ఉండే ఔదార్యం, దయా, కరుణా, వాత్సల్యం కనబడ లేదు. అందుకే ఒక్కరూ తన ప్రజలకు కొంచెమైనా ఉపకారం చెయ్యలేదు. వసువు ఈ విధంగా ఆలోచిస్తూ నిలబడి వుండగా కొందరు మనుష్యులు ఆ దారిన వస్తూ వసువు మొహం కేసి చూసి ఆ రాతి లోని ముఖం కేసి చూశారు. ఏమాశ్చర్యం! వసువు ముఖం మూడు మూర్తులా రాతి లోని ముఖంలాగే ఉంది!

ఈ వార్త క్షణంలో చుట్టుపక్కల గ్రామాలకు పాకింది. రాతిలోని ముఖం గురించి, దాన్ని గురించి పూర్వులు చెప్పుకొన్న గాథ గురించి మరిచిపోయిన వారంతా వసువు దగ్గిరికి వచ్చి మొట్ట మొదటిసారిగా రెండు ముఖాలకూ గల పోలికను చూసి ఆశ్చర్యపడసాగారు.

మునీశ్వరుడి అమోఘవచనం ఫలిం చింది. వసువు అనేకమంది మహనీయుల దగ్గిర నేర్చుకున్న విషయాలు తన ప్రజలకు ఉపయోగపడేటట్టు చేసి, ప్రజలలో ఒకడుగా ప్రజల కష్టసుఖాలు పంచుకుని, వారికి ఐశ్వర్యమూ, ఆనం దమూ చేకూర్చి, ధన్యజీవి అయినాడు.



## ఫోటో వ్యాఖ్యల పోటీ : : బహుమానం రు. 25 లు

ఈ ఫోటోల వ్యాఖ్యలు 1981 మార్చి నెల సంచికలో ప్రకటింపబడును.







P.V. Subramaniam — Pranlal K. Patel

★ పై ఫోటోలకు సరిఐన వ్యాఖ్యలు ఒక్క మాటలోగాని, చిన్న వాక్యంలోగానీ కావాలి. (రెండు వ్యాఖ్యలకు సంబంధం ఉండాలి.)

★ జనవరి నెల 20-వ తేదీలోగా వ్యాఖ్యలు మాకు చేరాలి. తరువాత చేరే వ్యాఖ్యలు ఎంతమాత్రమూ పరిశీలింపబడవు.

★ మాకు చేరిన వ్యాఖ్యలలో అత్యుత్తమంగా ఉన్న సెట్టుకు (రెండు వ్యాఖ్యలకు కలిపి) రూ. 25/–లు బహుమానం.

★ వ్యాఖ్యలు రెండూ పోస్టుకార్డుపైన రాసి, (వ్యాఖ్యలకు సంబంధించని ఇతర విషయాలేవీ చేర్చరాదు.) ఈ అడ్రసుకు పంపాలి :–చందమామ ఫోటో వ్యాఖ్యల పోటీ, మద్రాసు–26.

---

## నవంబర్ నెల పోటీ ఫలితాలు

మొదటి ఫోటో : కంటికింపైన చిందు

రెండవ ఫోటో : వంటకివి కావాలి ముందు

పంపినవారు : బి. రాము c/o బి. సాంబమూర్తి, ఎస్. కోట. (విజయనగరం జిల్లా)

బహుమతి మొత్తం రు. 25/–ఈ నెలాఖరులోగా పంపబడుతుంది.

Printed by B. V. REDDI at Prasad Process Private Ltd., and Published by B. VISWANATHA REDDI for CHANDAMAMA CHILDREN'S TRUST FUND (Prop. of Chandamama Publications) 188, Arcot Road, Madras-600 026 (India). Controlling Editor: NAGI REDDI.

A YEARFULL OF READING DELIGHT FROM

WALT DISNEY

Hurry! For your copy




ONLY Rs. 2/- A COPY






The Adventures of ZORRO - THE FOX

AND OTHER ENJOYABLE FEATURES...

A New Fortnightly

# చందాదారులకు గమనిక

'చందమామ' కాపీలు పంపుటకు మీ చిరునామాలో ఏదైనా మార్పుంటే 5-వ తేది లోగానే, మీ చందా నంబరు ఉపహరిస్తూ మాకు తెలపాలి, ఆలస్యమైతే మళ్ళీ నెల వరకు మీ క్రొత్త అడ్రసును అమలు పెట్టడానికి వీలుండదు.

డాల్టన్ ఏజన్సీస్

'చందమామ బిల్డింగ్స్'

మదరాసు - 26

# ఆనంద్ అభిలాష – ఆకాశంలో ఎగరడం













నేడే మీ బిడ్డ కొరకు కేవలం 10 రూ.లతో అకౌంట్ ప్రారంభించండి. 12 సంవత్సరాల వయస్సు వాడయ్యాక అతడే స్వయంగా దానిని నడుపుకో గలడు. అతడి డబ్బు 5% వడ్డీతో పెరుగుతుంది. అతడితో పాటు అతడు పొదుపు చేసిన పైకం ఎలా వృద్ధి చెందుతుందో మీరే చూడండి!

## మైనర్స్ సేవింగ్స్ అకౌంట్



**సెంట్రల్ బ్యాంక్ ఆఫ్ ఇండియా**

(భారత ప్రభుత్వపు యాజమాన్య సంస్థ)

ప్రజల వద్దకు మరియు ప్రదేశాల చేరువకు పోవు బ్యాంక్




Interpub/CBI/6/80 Tel